Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 29 • 16-7-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





● ఉపఎన్నికల ప్రచారంలో

## వెనుకబడ్డ తెరాస!

తెలంగాణ ఉప ఎన్నికలు మూడు పార్టీల లోనూ ఆశలు పెంచుతున్నాయి. టిఆర్ఎస్ సభ్యుల రాజీనామాల వల్ల ఏర్పడిన ఖాళీలివి. తెలంగాణ ఇవ్వనందుకు నిరసనగా రాజీనామాలు చేశారు. మొత్తం 12 స్థానాలు కూడా తెలంగాణ భావన బలంగా వున్న ప్రాంతాలు. ఉద్యమానికి కేంద్ర బిందువులు. అందువల్ల ఉప ఎన్నికలన్నప్పుడు ఏ పార్టీలోనూ ఆసక్తి లేదు. మొత్తం సీట్లు టిఆర్ఎస్‌కే మళ్లీ వెళ్తాయన్న భావన వుండింది. అందువల్లనే కాంగ్రెస్ పోటీకి దిగకూడదని తెలంగాణ నేతలు సూచన చేశారు. కాదని పోటీ చేస్తే అన్ని సీట్లూ ఓడిపోవడం తప్పదని జోస్యాలు చెప్పారు. టిడిపిది కూడా అటువంటి అభిప్రాయమే. కాంగ్రెస్ పోటీకి దిగింది కాబట్టి, వారూ అభ్యర్థులను నిలబెట్టారు తప్ప ఎన్నికల పట్ల ఆసక్తితో కాదు.

కానీ నామినేషన్ల ఘట్టం ముగిసి, ప్రచారం వూపందుకొన్న తర్వాత విచిత్రంగా అటు కాంగ్రెస్, ఇటు టిడిపిలలో గెలుపు పట్ల చిగురంత ఆశ మోసులెత్తుతున్నది. టిఆర్ఎస్‌లో ఓటమి భయం వ్యాపిస్తున్నది. టిఆర్ఎస్ అధినేత కెసిఆర్ నిర్లక్ష్య వైఖరే దీనికి కారణమని పరిశీలకుల భావన. గెలిచే ఎన్నికలు

కొరవ 14వ పేజీలో

● తనెటు పోవాలో తనకే అర్థంకాని

# అయోమయంలో జగన్!

జగన్ యాత్ర జోరుగా నడిచి పోతున్నది. చిరంజీవి, జూనియర్ ఎన్టీఆర్‌ల తరహాలో జనం వస్తున్నారు. అర్ధరాత్రి, అపరాత్రి వరకు వేచి వుంటున్నారు. కేరింతలు కొడుతున్నారు. చేతులూపుతున్నారు. ఆ సందడి చూసి జగన్‌లో ఉత్సాహం పరవళ్లు తొక్కుతున్నది. ఎమ్మెల్యేల గుండెల్లో గుబులు పడుతున్నది. ఈ జనాన్ని చూసి అయినా కాంగ్రెస్ అధిష్టానం తనను ముఖ్యమంత్రి కుర్చీ ఎక్కిస్తుందన్నది జగన్ ఆశ. కానీ ఢిల్లీ పెద్దలు ఆ ధోరణిలో లేరు. వద్దన్నా యాత్ర చేశాడన్న ఆగ్రహంతో మండి పడుతున్నారు. యాత్రలో వున్న జగన్‌ను పలకరించి వచ్చాడని రాజమండ్రి ఎమ్పీ ఉండవల్లి అరుణ్‌కుమార్‌కు అక్షింతలు వేశారు. ఆ దెబ్బతో ఒక్క ఎమ్పీ కూడా అటువైపు తల తిప్పి చూడడం లేదు. ఎమ్మెల్యేల పరిస్థితి ఇంకా ఇబ్బందిగా వుంది. యాత్రకు వెళ్తే అంతే అని హూంకరిస్తున్నాడు ముఖ్యమంత్రి రోశయ్య. అదే తీరులో జగన్ నుంచి ఒత్తిడి వుంది. మా నాయన మీకు అంత చేస్తే ఇదా మీరు చూపే కృతజ్ఞత అని రుసరుస లాడుతున్నాడు జగన్. ముందుకు వెళ్తే గొయ్యి, వెనక్కు తిరిగితే నుయ్యి అన్నట్లు వుంది ఎమ్మెల్యేల పరిస్థితి.




### ముఖం చాటేస్తున్నారు

ఇంతకూ ఈ యాత్ర ద్వారా జగన్ సాధించదలచింది ఏమిటి? సాధించింది ఏమిటి? వైఎస్ మరణ ఖేదాన్ని తట్టుకోలేక గుండె ఆగి మరణించిన వారి కుటుంబాలకు ఓదార్పు అన్నది కుంటిసాకు మాత్రమే అని జగన్‌తో సహా జగమంతటికీ తెలుసు. నిజంగా ఓదార్పే ఉద్దేశ్యమైతే ఎమ్మెల్యేలు ఎందుకు, మంత్రులెందుకు? ఆయనకు కావల్సింది బల ప్రదర్శన. నా దగ్గర ఇంత బలం వుంది అని అధిష్టానానికి హెచ్చరిక పంపాలనుకొన్నాడు. అయితే ఆ విషయంలో జగన్ ప్రయత్నాలు, అంచనాలు తలక్రిందులై పోయాయి. కనీసం నలభై, యాభై మంది ఎమ్మెల్యేలు తను నిప్పులో దూకమంటే దూకుతారని ఆశించాడు. కానీ యాత్ర మొదలై వారం రోజులు గడిచినా పట్టుమని పది మంది నికరంగా నిలబడలేదు. వైఎస్‌కు వీర విధేయులనుకొన్నవారు కూడా ముఖం చాటేశారు. శాసన సభ సమావేశాల తర్వాత వస్తామన్నది బుకాయింపు మాత్రమే.

### అయోమయమే అసలు కారణం

అట్లని ఎమ్మెల్యేలలో వైఎస్ పట్ల భక్తి ప్రపత్తులు లేవనుకోవడానికి లేదు. అందరూ విశ్వాసఘాతకులు కారు. కానీ జగన్ ధోరణి వారిని అయోమయంలోకి నెడుతున్నది. జగన్ ఉద్దేశమేమిటో అర్థం కావడం లేదు. జనాన్ని, బలాన్ని చూపించి అధిష్టానాన్ని బెదరించడంతో సరిపెడతాడా లేక స్వంత పార్టీ పెడతాడా అన్నది తేలడం లేదు. ఒక పక్క అధిష్టానం చెప్పిన మాట ధిక్కరిస్తున్నాడు. మరొకపక్క ఢిల్లీ పెద్దలతో ఆయన తరఫున వైఎస్ సతీమణి సంభాషణలు జరుపుతున్నారు. అటో ఇటో తేల్చుకోవాలనుకొన్నప్పుడు మాటా మంతీ ఎందుకన్నది ఎమ్మెల్యేల ప్రశ్న. ఒకవేళ జగన్ ఢిల్లీతో రాజీ పడిపోతే తమ గతి దుర్గతే కదా అన్నది ఎమ్మెల్యేల భయం. స్వంత పార్టీ పెట్టి నెగ్గుకొచ్చే సామర్థ్యం జగన్‌లో వుందా అన్నది సందేహం.

### ఆకర్షణ నీటి బుడగ

జగన్ యాత్రలకు జనం వస్తున్న మాట నిజమే. ప్రజలలో వైఎస్ పట్ల ఆరాధనా భావం వుంది. ఆయన ప్రవేశపెట్టిన పథకాలు, అమలు

కొరవ 14వ పేజీలో

### కార్టూన్ స్కేప్




కులం తోకను కత్తిరించుకొమ్మని మందలించారట!

# దోపిడీ రాజ్యం

ఖమ్మం జిల్లా బయ్యారం ఇనుప ఖనిజం గనులను కొల్లగొట్టడానికి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి అల్లుడు "బ్రదర్ అనిల్ కుమార్" చేసిన ప్రయత్నం తీరు చూస్తుంటే మన రాష్ట్రంలో నడుస్తున్నది ప్రజారాజ్యమా, దోపిడీ రాజ్యమా అన్న సందేహం కల్గుతున్నది. లక్షా నలభై వేల ఎకరాలలో విస్తరించి వున్న ఈ గనులను ఒకే ఒక్క సంతకంతో అల్లుడికి నజరానాగా కట్టబెట్టి వెళ్లాడు రాజశేఖర్‌రెడ్డి. నిజాం పరిపాలనలో కూడా ఇంత భారీ జాగీరులను దానం చేసిన చరిత్ర లేదు. అందులోనూ ఈ భూములు మొత్తం గిరిజన ఏజన్సీ ప్రాంతంలో విస్తరించి వున్నాయి. గిరిజన ప్రాంతాలలో గిరిజనేతరులకు భూములు కేటాయించడం చట్ట విరుద్ధం. అందుకోసం వన్ ఆఫ్ సెవంటీ అనే ప్రత్యేక చట్టం ఒకటి వుంది. దీని ప్రకారం గిరిజనేతరులకు ఒక్క ఎకరం భూమి సాగు చేసుకోవడానికి కూడా కేటాయించకూడదు. గిరిజనులు నోరులేని అమాయక జీవులు. ప్రకృతి ఒడిలో అడవి బిడ్డలు. నాగరిక జీవనంలోని కపటం, కల్మషం వారికి తెలియదు. ఇటువంటి ప్రత్యేక చట్టపరమైన రక్షణ అనేది లేకుంటే, మైదాన ప్రాంతాల మేధావులు వారి భూములన్నీ స్వాధీనం చేసుకొని, అడవుల నుంచి వారిని వెళ్లగొడతారన్న ఉద్దేశంతోనే వన్ ఆఫ్ సెవంటీ చట్టం చేశారు. దాన్ని అతిక్రమించడానికి ఆంధ్ర ప్రదేశ్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌ను అడ్డం పెట్టుకొన్నాడు వైఎస్ అల్లుడు. అది ప్రభుత్వరంగ సంస్థ కాబట్టి, దానికి ఆ చట్టం వర్తించదనే నెపంతో, మొత్తం భూమిని మొదట ఎపిఎండిసికి కేటాయించింది ప్రభుత్వం. ఆ వెంటనే, ఆ సంస్థ తరపున ఇనుప ఖనిజం వెలికి తీసే బాధ్యతను అల్లుడికి చెందిన రక్షణ స్టీల్స్ అనే కంపెనీకి దఖలు పరచారు. గిరిజనుల సంక్షేమం కోసం మన పూర్వీకులు పకడ్బందీగా రూపొందించిన చట్టాన్నిఎంత సులువుగా నిర్వీర్యం చేశారో చూడండి. గిరిజనుల నోరు కొట్టడానికి ఈ దుర్మార్గ ప్రక్రియను అవలంభించడం మన రాష్ట్రంలో చాలా చోట్లే జరిగింది. విశాఖపట్నం ఏజన్సీ ప్రాంతాలలో లక్షల కోట్ల విలువైన బాక్సైట్ ఖనిజాన్ని ఇదే తీరులో జిందాల్, రస్ అల్‌ఖైమా అనే సంస్థలకు దారాదత్తం చేశారు. దానికి నిరసనగా ఆ ప్రాంతాలలో మావోయిస్టులు ప్రారంభించిన ఉద్యమం నెత్తుటి మడుగులను సృష్టిస్తున్నది.

అనంతపురం జిల్లా ఇనుప ఖనిజపు గనులను గాలి జనార్దనరెడ్డికి బహూకరించడం కూడా ఇదే తీరులో జరిగింది. ఆయన కడప జిల్లాలో ఉక్కు కర్మాగారం నిర్మిస్తున్నాడని చెప్పి లక్షల కోట్ల విలువ చేసే ఇనుప ఖనిజపు గనులను ఉచితంగా ఇచ్చేశారు. ఇందులో వైఎస్ కుమారుడు జగన్‌కు వాటా వుందన్నది బహిరంగ రహస్యం. కానీ నాలుగేళ్లు గడుస్తున్నా గాలి జనార్దనరెడ్డి ఉక్కు కర్మాగారం పెట్టింది లేదు. మరొక పదేళ్లకు కూడా ఆయన ఆ ప్రయత్నం చేస్తాడని భావించలేము. తన కుటుంబసభ్యులు, తన సన్నిహితులకు రాష్ట్ర సంపదను దోచి పెట్టడంలో వైఎస్.రాజ శేఖర్‌రెడ్డి అన్ని రికార్డులను బ్రద్దలుకొట్టాడు. మరణించిన నేత పైన విమర్శలు చేయడం సంస్కారం కాకపోయినా, ఆయన చేసి వెళ్లిన అక్రమాలను సరిదిద్దవలసిన బాధ్యత మాత్రం ప్రస్తుత ప్రభుత్వం మీద వుంది.

నానో కార్ల ప్రాజెక్ట్ కోసం ఐదు వందల ఎకరాలు సేకరించిన నేరానికి పశ్చిమ బెంగాల్‌లో ముప్పైఐదేళ్ల కమ్యూనిస్టు సామ్రాజ్యం శిథిలమైపోయింది. ప్రభుత్వ దుర్నీతిని ఎండకట్టడానికి ప్రజలను సమీకరించడంలో మమతా బెనర్జీ చూపిన అద్భుత రాజకీయ చాణక్యం అందుకు కారణం. మన రాష్ట్రంలో ఐదు లక్షల ఎకరాల భూమి ధారాదత్తం చేసినా ప్రతిఘటించే స్థాయిలో ప్రతిపక్షం లేదు. తెలుగుదేశంతో సహా ప్రతిపక్ష పార్టీలన్నిటికీ ఆయా పారిశ్రామికులతో వున్న లాలూచీ వల్లనే మన రాష్ట్రంలో ప్రజాఉద్యమాలు నిర్వీర్యమైపోతున్నాయి. ఆ అలుసు చూసుకొని ప్రభుత్వాన్ని నడిపేవారు పెట్రేగి పోతున్నారు. ప్రజల సంపదను ప్రైవేటు వ్యక్తులకు దోచిపెడుతున్నారు. దొంగలు దొంగలు ఊళ్లు పంచుకొన్నట్లు ముఖ్యమంత్రులు, మంత్రులు, ఎమ్మెల్యేలు, రాజకీయ పలుకుబడి కల్గిన వ్యాపారులు రాష్ట్రాన్ని కొల్లగొడుతున్నారు. ఈ దురన్యాయం ఇట్లనే కొనసాగితే మన రాష్ట్రంలో ప్రభుత్వ భూమి అన్నది మచ్చుకు కనపడదు. ఈ దురన్యాయానికి ముగింపు ఎప్పుడో, ఎవరూ పుణ్యం కట్టుకొంటారో భగవంతుడికే తెలియాలి.

జమీన్‌రైతు

## జనవాణి

### మనది సంక్షేమ రాజ్యమా?

నెల్లూరు జిల్లాలో త్రాగునీటి వసతిలేని గ్రామాలు ఎన్నో వున్నాయి. కాని మద్యం బెల్టు షాపులు లేని గ్రామాలు మాత్రం లేవు. వీటి మూలంగా యువత వేలం వెర్రిగా తాగుడుకు బానిసలవుతున్నారు. గ్రామాల్లోని బెల్టు షాపుల పాట లక్షలకు పోవడం విచిత్రమనిపించినా అక్కడి అమ్మకాలు చూసి నోరెళ్ల బెట్టాల్సిందే. గతంలో మద్య వ్యతిరేక పోరాటం చేసిన జిల్లాలో సగటున ఒక్కో మద్యం షాపు కోటి రూపాయలకు పాట బోవడం బాధాకరం. రాష్ట్రంలో రోజువారి జనం 40 కోట్ల రూపాయల మద్యం తాగేస్తున్నారు. జనాన్ని వ్యసనానికి బానిసలు చేస్తున్న రాజ్యం ఏ విధంగా సంక్షేమ రాజ్యమవుతుంది. మద్యం అమ్మకాలు చేయకపోతే ప్రభుత్వాలు నడవని పరిస్థితి వచ్చేయడం కన్నా బాధాకరం ఇంకేమున్నది?

సయ్యద్ అజ్మతుల్లా, బోగోలు

### విద్యా విధానం మారాలి

కేంద్రంలో ఎన్ని ప్రభుత్వాలు మారినా విద్యారంగంలో ఆశించిన మార్పులు రావడం లేదు. సంస్కరణల కోసం కమిటీలు, కమిషన్‌లు వేస్తూ కాలయాపన చేయక ఉన్నత విద్యలోనే కాక ప్రాథమిక విద్యారంగంలో కూడా పలు మార్పులను మారుతున్న పరిస్థితుల దృష్ట్యా చేయాల్సి వుంది. ఆధునిక సమాచారం, సైన్సు టెక్నాలజీ, ఉపాధి అవకాశాలలో అన్ని దేశాల వారిని ఆకర్షిస్తూ మనదేశ విద్యార్థులను ధనార్జనకై వలసలపాలు చేస్తున్నాయి. ఈ వలసలను ఆపే దిశగా ప్రభుత్వం కృషి చేయాలి. భారతదేశ సంపత్తి దేశానికి ఉపయోగపడేలా విధి విధానాలు రూపొందించాలి.

పి.సుబ్బరాయుడు, నెల్లూరు

### హిందూ ధర్మపీఠానికి టిటిడిని అప్పగించండి!

తిరుమల పలు అవినీతి అక్రమాలకు కేంద్రంగా మారుతోంది. ఆపద మొక్కులవాడు, అనాధరక్షకుడు తిరుపతి వెంకన్న బంగారు ఆభరణాలు, ఆస్తులకు రక్షణ లేకుండా పోతోంది. ఇటీవల తిరుమల దేవస్థానంలో జరిగిన విషయాలు పరిశీలిస్తే అక్కడి పాలకవర్గం, ప్రధాన అర్చకుల విపరీత ధోరణి ప్రస్ఫుటమవుతోంది. ముఖ్యంగా టిటిడి ఛైర్మన్ ఆదికేశవులు నాయుడు, ప్రధాన అర్చకుడు రమణదీక్షితులు దేవుని సేవలు మాని కోటీశ్వరుల సేవలో పునీతులవుతున్నారు. ప్రభుత్వం ఇప్పటికైనా పునరాలోచించి దేవస్థానం బాగోగులు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

19-7-1940
పేజీలు : 16 వెల: అణా

### ఉడ్‌హౌస్ దొరసానిపేట

నెల్లూరులో స్టోన్‌హౌస్‌పేట వద్ద, సర్వేపల్లి కాలువ ఒడ్డున యానాదుల కాలనీ ఏర్పడి వున్నది. జూలై 12వ తేది జిల్లా జడ్జి మ్యాకు సతీమణిచే ఆ కాలనీకి ఉడ్‌హౌస్ దొరసానిపేటయను నామధేయమివ్వబడినది. అచ్చటికి జిల్లా కలెక్టర్ గాన్‌దొరగారు, ఇంకనూ పలువురు పుర ప్రముఖులు వచ్చి యుండిరి.

### యానాది హాస్టలు!

సర్వేపల్లి కాలువ ఒడ్డున నిన్నమొన్నటి దాకా పౌరులు బైటబొయ్యే పాయిఖానా దొడ్డి అక్కడబెడ్తున్న యానాది కుటీరాల మధ్య 17వ తేది సాయంత్రం పెద్దసభ. జిల్లాలోని ప్రముఖులంతా రావడం యానాది హాస్టలు "శ్రద్ధానంద హోమ్" అనే పేరుతో మాజీ మంత్రి బెజవాడ గోపాలరెడ్డి గారు ప్రారంభోత్సవం జరపడం ముసలి సింహం ప్రకాశం పంతులొచ్చి ఆశీర్వాదాలు కురిపించడం, మునిసిపల్ ఛైర్మన్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించడం, ఇదంతా చెత్త తొట్లో మురుగుతున్న యానాది సంఘ భావభ్యున్నతికి శుభోదయం కాదని ఎవరంటారు? ఆ పాళానికి ఆళ్ల బాలకృష్ణారెడ్డి యానాది సంఘం అని పేరు పెట్టడం హాస్టలుకు శ్రద్ధానంద హోమని నామకరణ చేయడం సముచితంగా వుంది.

ఈ కృషికుడు వెన్నెలకంటి రాఘవయ్య గారికి కూడా "యానాది రాఘవయ్య" అనే పేరుబెట్టి కృతజ్ఞత చూపాలన్న ఛైర్మన్ గారి సూచన గూడా తమాషాది గాదు. గమనార్హమైందే!

### లక్ష కేసు తీర్పు

నెల్లూరు తాలూకా ట్రెజరీలో జరిగిన లక్ష రూపాయల చోరీ కేసులో న్యాయమూర్తి ఇ.ఇమాక్ దొరగారు 17వ తేది తీర్పు చెప్పినారు. పట్టపగలు అంత సాహసంగా ఆఫీసర్ల ఎదుటనే దొంగతనం చేసిన నేరస్తుడు సెక్షన్ క్రింద పూర్తి శిక్షకు పాత్రుడు కాగలడని చెబుతూ జడ్జి, గఫూర్‌ఖాన్‌కు ఐపిసి 381 సెక్షన్ క్రింద ఏడు సంవత్సరాల కఠిన శిక్షను, రెండవ ముద్దాయియగు యానాది నరసిగాడికి రెండు సంవత్సరాలు కఠిన శిక్షను విధించినారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

15-7-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### సమ్మె సాఫల్యం చెందలేదు

దేశ శ్రేయస్సును విస్మరించినందుకు; ఆవేదనాపూరితమైన ప్రధాని విజ్ఞప్తిని, పెద్దల హితవును పెడచెవినబెట్టి వ్యవహరించినందుకు సమ్మెలో పాల్గొన్న కేంద్ర ప్రభుత్వోద్యోగులకు చక్కని గుణపాఠం జరిగింది. సమ్మెకు పూనుకొని ప్రభుత్వ, ప్రజల సానుభూతిని కోల్పోయారు. ఆశయం నెరవేరలేదు; సమ్మె సాఫల్యం జెందలేదు. ఒక్క ముంబాయి, కలకత్తా నగరాలలో చెదురుగా అచ్చటచ్చటా తప్ప, కేంద్ర ప్రభుత్వానికి చెందిన అన్ని శాఖలు – రైళ్లు గూడా మామూలుగా పనిజేస్తున్నవి. 14వ తేది సానుభూతి సమ్మెగూడా విజయవంతం కాలేదు కాబట్టి, అసలు సమ్మె ఒకటి రెండు రోజుల్లో నామరూపాలు లేకుండా పోవచ్చు.

ఈ సమ్మెలో ప్రజా సోషలిస్టు – కమ్యూనిస్టు రాజకీయాలు అంతరంగికంగా వున్నవని అంటారు. స్వదేశం వచ్చిన అశోక్ మెహతా సమ్మె నివారణకు కృషిచేసే సూచనలు కనబడుతున్నవి. ఆంధ్రలో ఒక్క విశాఖపట్నం తప్ప సమ్మె అని చెప్పుకోదగిన పరిస్థితులు లేవు.

### దివాలా దీయవలసిందే!

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల కోర్కెలు, సమ్మెను గూర్చి వాఖ్యానిస్తూ, ఒరిస్సా ముఖ్యమంత్రి హరేకృష్ణ మెహతాబ్, వారు కోరే కనీస వేతనం యిచ్చినపుడు దాని ప్రభావం రాష్ట్రాల మీద వుండగలదని, రాష్ట్రాలు గూడా తన ఉద్యోగులకు ఆ జీతాలు యిచ్చేట్లుంటే అవి దివాలాదీయవలసిందేనని చెప్పారు.

### సేవకు సిద్ధమైన గవర్నర్లు, మంత్రులు

కేంద్ర ప్రభుత్వోద్యోగుల సమ్మె సందర్భంలో తాము ఏ పని చేయమన్నా రోజూ కొంతసేపు చేయగలమని పంజాబు గవర్నర్ గాడ్గిల్, గుజరాత్ గవర్నర్ మెహ్ది నవాజ్‌జంగ్ తెలియజేశారు. రోజూ ఉదయం, సాయంకాలం ఒక్కో గంట తాను మద్రాసులోని ఏ కేంద్ర కార్యాలయంలోనైనా పనిజేయగలనని మంత్రి సి.సుబ్రహ్మణ్యం తన సంసిద్ధతను తెలియజేశారు.

# నెల్లూరు ముచ్చట్లు
## విశేషాలు

## చంద్రబాబు వచ్చివెళ్లారు

తెలుగుదేశం పార్టీ సర్వాధినేత నారా చంద్రబాబునాయుడు 10వ తేది వెంకటగిరికి వచ్చారు. వెంకటగిరి రాజా వివిఆర్‌కె యాచేంద్ర ఉత్తరక్రియలకు హాజరయ్యి ఆయన కుటుంబీకులను పరామర్శించారు. చంద్రబాబు వెంట పార్టీ నాయకులు సిఎం రమేష్, గాలి ముద్దుకృష్ణమనాయుడు, బొజ్జల గోపాల కృష్ణారెడ్డి, ఎర్రబల్లి దయాకర్‌రావు, వర్ల రామయ్య, సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, బీద రవిచంద్ర, వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ వుండినారు.

## ఎన్టీఆర్ రియల్ హీరో!

అటు సినీరంగంలో గాని, ఇటు రాజకీయరంగంలో గాని స్వర్గీయ ఎన్టీ రామారావుకు సాటి రాగలవారు ఎవరూ లేరని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చెప్పుకొచ్చారు. 13వ తేది నెల్లూరులోని పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. తెరాస సిద్ధాంతకర్త ప్రొఫెసర్ జయశంకర్ ఎన్టీఆర్‌ను విమర్శించడం తగనుగాక తగదు. అసలు తెలంగాణ ప్రజలను బానిసలుగా చూసే పటేల్, పట్వారీల వ్యవస్థను ఎన్టీరామారావు రద్దుచేసిన విషయం మర్చిపోతే ఎలానన్నారు. జయశంకర్‌ను వైస్ ఛాన్సలర్‌ను చేసింది ఎన్టీ రామారావేనని, కెసిఆర్‌కు రాజకీయ భిక్ష పెట్టింది కూడా ఆయనే నన్నారు. రేషన్‌కార్డు దానితోపాటు రెండు రూపాయలకు కిలో బియ్యం ఇచ్చి వరి అన్నం తినే భాగ్యాన్ని తెలంగాణ ప్రజలందరికీ కల్పించిన మహానుభావుడు ఎన్టీఆర్‌ను విమర్శించిన వారికి పుట్టగతులుండవన్నారు.

## జగన్‌కు మద్దతు తెలిపిన విష్ణు!

కావలి నియోజకవర్గ కాంగ్రెస్ పార్టీ ఇన్‌ఛార్జ్ కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి జగన్మోహన్‌రెడ్డికి మద్దతు పలుకుతూ 13వ తేది కావలిలో విలేకరులతో మాట్లాడారు. స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డిని అన్ని పార్టీల్లో అభిమానించే వారున్నారు. ఆయన ఆకస్మిక మరణంతో కలతచెంది ఎందరో మరణించారు. వారిని పరామర్శించడానికి జగన్ ఓదార్పు యాత్ర చేపట్టడం ఏమాత్రం తప్పుకాదు. గతంలో వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన పాదయాత్రకు సైతం కాంగ్రెస్ పార్టీ అధిష్టానం ముగింపు దశలో మద్దతు ఇచ్చిందని, జగన్ ఓదార్పుకు అదేవిధంగా గ్రీన్ సిగ్నల్ ఇస్తుందన్నారు.



## టిడిపి కార్యవర్గం ప్రమాణం 21న!

జిల్లా తెలుగుదేశం పార్టీ నూతన కార్యవర్గం ఈ నెల 21వ తేదీన పదవీ బాధ్యతలు స్వీకరిస్తుందని అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చెప్పారు.

## ట్రాన్స్‌కో పోటీల్లో ఛాంపియన్ నెల్లూరు

రాష్ట్రంలోని ట్రాన్స్‌కో ఉద్యోగులకు ఆటవిడుపుగా ఆటల పోటీలు నెల్లూరు ఎసి స్టేడియంలో జరిగాయి. ఈ పోటీల్లో నెల్లూరు ఆపరేషన్ సర్కిల్ ఓవరాల్ ఛాంపియన్ షిప్‌ను సాధించింది. ముగింపు వేడుకల్లో సంస్థ సిఎండి గోపాలరెడ్డి హాజరై క్రీడాకారులకు జ్ఞాపికలను అందజేశారు. వినియోగదారులు చెల్లించిన బిల్లులతోనే సంస్థ, సిబ్బంది బతుకుతున్నామని దీనిని గుర్తుంచుకొని వినియోగదారులతో సఖ్యతగా మెలగాలని హితబోధ చేశారు.

## న్యాయవాదులను హడలెత్తించిన సిఐ!

సహజంగా నోటీసులు, దావాలతో ప్రజలను న్యాయవాదులు హడలెత్తిస్తుంటారు. అటువంటిది నెల్లూరు నగరంలోని పది మంది ప్రముఖ న్యాయవాదుల మీద ప్రైవేటుగా అట్రాసిటీ కేసు పెట్టి వారిని హడలెత్తించారు జిల్లాలో వివాదాస్పద పోలీసు అధికారిగా గుర్తింపు పొందిన డి.వెంకటేశ్వర్లు. వెంకటేశ్వర్లు ఎస్పీ శ్రీనివాసరెడ్డి హయాంలో ఐడి పార్టీ ఎస్ఐగా పనిచేశారు. ఈ సందర్భంగా ఆయన తాటి వసంతకుమార్‌రెడ్డి అనే వ్యక్తిని అదుపులోకి తీసుకొని పోలీస్ గెస్ట్‌హౌస్‌లో వుంచారు. కోర్టు ఈ విషయమై ఇచ్చిన సెర్చ్ వారెంట్‌తో అక్కడకు వెళ్లిన న్యాయవాదులు సూర్య ప్రకాశరావు, తెనాలి శ్రీనివాసులు, ప్రతాప్‌సింగ్, అడ్వకేట్ కమిషనర్ ఉమామహేశ్వరరెడ్డిలు తమతో వెంకటేశ్వర్లు గొడవ పడ్డారంటూ న్యాయవాదులు నెలరోజులు ఆందోళన చేపట్టారు. ఈ వ్యవహారమై వసంతకుమార్ పోలీసులపై ఓ కేసు దాఖలు చేశారు. ఈ సంఘటన జరిగిన తొమ్మిదేళ్లకు న్యాయవాదులు సూర్యప్రకాశ్‌రావు, తెనాలి శ్రీనివాసులు, ఉమామహేశ్వరరెడ్డి, టి.శ్రీహరి, రోజా రెడ్డి, రాజగోపాల్‌రెడ్డి, నరేంద్రరెడ్డి, అయ్యప్పరెడ్డిలతోపాటు మరో ఆరుగురిపై వెంకటేశ్వర్లు ఐదవ జుడిషియల్ మొదటి తరగతి కోర్టులో ప్రైవేటు కేసు దాఖలు చేశారు. దీంతో ఈ వ్యవహారంతో ప్రమేయమున్న 16 మందిపై ఎస్సీ, ఎస్టీ చట్టం క్రింద కేసు నమోదు చేయమని న్యాయమూర్తి ఆదేశించారు.

సంచలనం సృష్టించిన ఈ వ్యవహారమై నెల్లూరు బార్ అసోసియేషన్ ప్రత్యేకంగా సమావేశమయ్యింది. కేసు నమోదుకు ఆదేశించిన న్యాయమూర్తిపై ఉన్నతస్థాయి న్యాయమూర్తులకు ఫిర్యాదు చేయాలని తీర్మానించింది. కేసు రద్దుకు హైకోర్టులో పిటిషన్ దాఖలుచేసి, సిఐకి ఈ కేసులోనే సహకరించిన న్యాయవాది ఆకుల వెంకటేశ్వర్లుకు షోకాజ్ నోటీసులు పంపించింది.

వెంకటేశ్వర్లు పోలీసు అధికారులు రాజకీయనాయకుల వ్యవహారశైలి వల్ల బాగా నలిగిపోయాడు. తనను గతంలో ఇబ్బంది పెట్టిన వారిని తాను ఇబ్బంది పెట్టాలని ఈ కేసు పెట్టినట్లుంది. పెద్ద మనుషుల ప్రమేయంతో ఈ వ్యవహారాన్ని న్యాయవాదులు పరిష్కరించుకోవచ్చునేమో? కానీ ఆ దిశగా ఆలోచన లేనట్లుంది.



## జీవప్రదాతకు సజలనయన ప్రణామం!



**20వ తేదికి 17 సంవత్సరాలు గడుస్తాయి - ఈ 17 సంవత్సరాలు పదిహేడు యుగాలుగా కన్పిస్తున్నాయి. తుది శ్వాస విడిచే వరకు పత్రికా సంపాదకత్వమే తన ప్రాణంగా భావించి, పత్రిక భవిష్యత్తు కోసం జీవితం పణంగా పెట్టిన జమీన్‌రైతు జీవప్రదాత నెల్లూరు శ్రీరామమూర్తి గారి ఎడబాటు - ఎన్నేళ్లు గడిచినా దుర్భరంగానే కన్పిస్తున్నది. 17వ వర్ధంతి సందర్భంగా సజల నయనాలతో ఆయన్ను స్మరించుకొంటున్నాము; ప్రణమిల్లు తున్నాము.**

**- జమీన్‌రైతు కుటుంబం**



**స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరులోని వాత్సల్య అనాథ శరణాలయంలో విద్యార్థులకు స్కూల్ బ్యాగ్‌లు పంపిణీ చేస్తున్న అరణి కందప్ప మేస్త్రీ సత్రం పాలకమండలి సభ్యుడు గూండాల మధుసూదన్‌రెడ్డి, చెంగయ్య ఆచారి, మోహన్‌రాజు, నరసింగరావు.**

## నెల్లూరులో కొత్త సిఐలు!

ఎస్ఐలుగా వుండి సిఐలుగా ప్రమోషన్ లభించిన ఇద్దరికి నెల్లూరులోనే గుంటూరు రేంజ్ డిఐజి పోస్టింగు లిచ్చారు. ఎస్పీ ఐడి పార్టీ ఎస్ఐగా వుండిన ఐ.శ్రీనివాసన్ సిసిఎస్ ఎస్ఐగా బాధ్యతలు తీసుకొన్నారు. శ్రీనివాసన్ ఎస్ఐగా మంచి పేరు తెచ్చుకొన్న అధికారి.

నెల్లూరు మహిళా పోలీస్‌స్టేషన్ సిఐగా కిషోర్‌బాబును నియమించారు. గతంలో మహిళా పోలీస్‌స్టేషన్‌కు ఎస్ఐ స్థాయి అధికారినే ఇన్‌ఛార్జ్‌గా వ్యవహరించేవారు. కిషోర్‌బాబు నియామకంతో ఈ స్టేషన్ స్థాయిని పెంచారు. కిషోర్ బాబు ఇదివరలో ఇందుకూరుపేట ఎస్ఐగా పనిచేశారు.

## ఆర్కే డిజిటల్ ప్లాజాలో దొంగతనం!

నెల్లూరు గాంధీబొమ్మ సెంటర్‌లోని ఆర్కే డిజిటల్ ప్లాజా గోడకు కన్నం వేసి నాలుగు లక్షల రూపాయల విలువైన ఎలక్ట్రానిక్ వస్తువులను దొంగలు పట్టుకెళ్లారు. షోరూం నిర్వాహకులు ఆదివారం తాళంవేసి సోమవారం ఉదయం తెరచి చూడగా సోని డిజిటల్ కెమెరాలు, సాంసంగ్ డిజిటల్ కెమెరా, ఎల్‌సిడి టివి, డివిడిలు చోరీ అయినట్లు గమనించారు. 24 గంటలు జన సామర్థ్యం వుండే ఈ ప్రాంతంలో దొంగతనం జరిగిన తీరును డిఎస్పీ రాధికతోపాటు క్లూస్‌టీం ఇన్‌స్పెక్టర్ శివారెడ్డి పరిశీలించారు.

## జడ్పీ ఛైర్మన్ కప్ పోటీలు

గ్రామీణ ప్రాంతంలో వుండే యువ క్రీడాకారులను ప్రోత్సహించే లక్ష్యంతో జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తన స్వంత నిధులు వెచ్చించి గత నాలుగేళ్లుగా నిర్వహిస్తున్న జడ్పీ ఛైర్మన్ కప్ పోటీలు ఈ నెల 21వ తేది నుంచి 23వ తేది వరకు నెల్లూరు

కొరవ 14వ పేజీలో

# వైద్యం ఖరీదయ్యింది!

## విలవిలలాడుతున్న సామాన్య, మధ్యతరగతీయులు

సామాన్య, మధ్యతరగతీయులకు చిన్నపాటి అస్వస్థత కలిగినా నెల్లూరు నగరంలో వైద్యం చేయించుకోవడం కష్టంగా మారింది. విపరీతంగా పెరిగిపోయిన డాక్టర్ సలహా సంప్రదింపుల ఫీజు, ఆతర్వాత వాళ్ల వ్రాసే మూత్ర, రక్త పరీక్షలు, ఎక్స్‌రే, స్కానింగ్ ఫీజులు తడిచిమోపెడవుతున్నాయి. చివరగా డాక్టర్ల వ్రాసే ప్రిస్క్రిప్షన్‌లోని మందుల ధరలు చూసి రోగులు మరింతగా క్రుంగి పోతున్నారు. నగరంలోని రామచంద్రారెడ్డి హాస్పిటల్, జయభారత్ హాస్పిటల్, నెల్లూరు హాస్పిటల్‌లలో మాత్రమే డాక్టర్ల సలహా సంప్రదింపులు ఫీజు తక్కువగా వుంది. నగరంలోని ఎంబిబిఎస్ అర్హత గల డాక్టర్లు సలహా సంప్రదింపుల ఫీజుగా 60 రూపాయలు తీసుకుంటుండగా, ఎం.డి, ఎం.ఎస్ అర్హతలు కలిగినవారు నూరు నుంచి



నూటయాభై రూపాయలు తీసుకొంటుంటారు. సూపర్ స్పెషాలిటీ హాస్పిటళ్లలో ఆయా విభాగాల స్పెషలిస్టులు 250 రూపాయలు, ఇంకా పేరుగాంచిన స్పెషలిస్టులు 450 రూపాయల సలహా సంప్రదింపుల ఫీజుతో మాసంలో రెండు, మూడు సార్లకు మించి చూడడం లేదు. నగరంలోని లాబొరేటరీల్లో షుగర్ నిర్ధారిత పరీక్ష స్వంతంగా చేయించుకుంటే 70 రూపాయలు, వైద్యుల ద్వారా వస్తే 90 రూపాయలు తీసుకొంటున్నారంటే డాక్టర్లు ఎంత కమీషన్ రాయుళ్లుగా మారారో అర్థం చేసుకోవచ్చు. రకరకాల రక్తపరీక్షలు, ఎక్స్‌రే, స్కానింగుల మూలంగా ఒక రోగికి వ్యాధి నిర్ధారణ చేసేలోగా డాక్టర్‌కు 150 రూపాయల నుంచి 200 రూపాయలు కమీషన్‌గా వచ్చేస్తుంది. సలహా సంప్రదింపుల ఫీజుతో కలిపితే ఇది 350 రూపాయలుగా వుంటుంది. హాస్పిటల్‌కు అనుబంధంగా నడిచే మందుల షాపులన్నీ డాక్టర్లవే. ఆరోగ్యశ్రీ కార్డులు వచ్చిన ప్పటి నుంచి ఎంత స్థాయి తక్కువ ఆసుపత్రి అయినా తక్కువ రూమ్ రెంట్ అంటే 500 రూపాయలుగా మారిపోయింది. చిన్న సర్జరీ అంటే పదివేలు పైమాటే. ఆరోగ్యశ్రీ పథకం కార్డులకు వైద్యంచేసే వెసలుబాటు వున్న ఆస్పత్రుల్లో దోపిడీ మరీ ఎక్కువగా వుంది. ఈ హాస్పిటళ్లలో అర్ధరాత్రి, అపరాత్రి వెళ్తే బెడ్స్ ఖాళీలేవని నిర్దయగా చెప్పేస్తున్నారు. పాత రోజుల్లో నెల్లూరు డాక్టర్లు తమ సేవలతో ఎనలేని ప్రజాభిమానం పొందారు. నేటి డాక్టర్లు రెండు మూడు సంవత్సరాల్లో కోటీశ్వరులై పోతున్నారు. అదే తేడా!

# చేపల మార్కెట్ స్థలం దురాక్రమణ



చేపల మార్కెట్‌లో అక్రమ నిర్మాణం.

నెల్లూరులో ప్రభుత్వ స్థలాల దురాక్రమణ యథేచ్ఛగా సాగిపోతుంది. అధికారపార్టీలో కాస్త బలమున్న నేతలు ఏం చేసినా అధికారగణం చూస్తూ ఊరుకోవడం తప్ప చర్యలే తీసుకోవడం లేదు. వన్‌టౌన్ చుట్టుప్రక్కల ప్రాంతాల్లో దురాక్రమణలకు వెన్నుదన్నుగా నిలిచే సీనియర్ కార్పొరేటర్ సందాని బాష అండదండలతో డైకస్‌రోడ్డు చేపల మార్కెట్‌కు సంబంధించిన ఐదంకణాల స్థలాన్ని ఆయన అనుచరుడొకడు దురాక్రమించి కట్టడాన్ని నిర్మిస్తున్నాడు. ఈ ప్రాంతంలో అంకణం స్థలం విలువ మూడు నుంచి నాలుగు లక్షల రూపాయలు. ఈ విలువను ఇక్కడ లెక్కించకూడదు. కార్పొరేషన్‌కు సంబంధించిన స్థలాన్ని దురాక్రమిస్తున్నారన్న విషయాన్ని కొందరు కమిషనర్ టి.ఎస్.ఆర్.ఆంజనేయులు దృష్టికి తీసుకెళ్లినా తాను అసహాయుడనని సమాధానం చెప్పారట. మునిసిపల్ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి స్వంత పట్టణంలో ప్రభుత్వ స్థలం ఆక్రమణను మునిసిపల్ అధికారులు ఆపలేకపోతున్నారంటే అంతకంటే అవమానమింకొకటి వుందా? ఇప్పటికైనా అధికారులు కళ్లు తెరచి ఈ అక్రమ నిర్మాణాన్ని ఆపకుంటే ప్రజల దృష్టిలో దద్దమ్మలుగా నిలిచిపోతారు.

# సరికొత్త విద్యా పథకం

జిల్లాలోని ఉన్నత పాఠశాలల్లో విద్యా ప్రమాణాలు మరింత మెరుగుపర్చేందుకు రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్ పథకాన్ని కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఈ పథకం క్రింద జిల్లాలోని 365 పాఠశాలలకుగాను 364 పాఠశాలల్లో కమిటీలు ఏర్పాటు చేయడం జరిగింది. వీటిలో 302 జిల్లా పరిషత్, 14 ప్రభుత్వ, 20 మునిసిపల్, ఆరు రెసిడెన్షియల్ పాఠశాలలు, 12 సాంఘిక సంక్షేమ శాఖ పాఠశాలలు, మూడు గిరిజన సంక్షేమ శాఖ పాఠశాలలున్నాయి. ఈ పథకం క్రింద వెనుకబడిన మండలాలైన ఎ.ఎస్.పేట, దుత్తలూరు, కొండాపురం, కలిగిరి, కావలి, సీతారాంపురం, మర్రిపాడు, వెంకటగిరి, దొరవారిసత్రం, తడ ప్రాంతాలలో ఒక్కో మాడల్ పాఠశాలను ఏర్పాటు చేసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఒక్కో పాఠశాల ఏర్పాటుకు కనీసం ఐదెకరాల స్థలం అవసరం వుంటుంది. పలు ప్రాంతాల్లో స్థలాన్వేషణ జరుగుతుంది. రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్‌కు అవసరమైన నిధులను కేంద్ర ప్రభుత్వం విడుదల చేస్తుంది. ఈ పథకం నిర్వహణకు జిల్లాస్థాయి రిసోర్సు పర్సన్స్‌గా 105 మందిని గుర్తించడం జరిగింది. వీరిలో 86 మందికి శిక్షణా కార్యక్రమం కూడా పూర్తయ్యింది. శిక్షణ పొందినవారు మండల స్థాయిలో ఉపాధ్యాయులకు శిక్షణ కూడా ఇవ్వడం జరిగింది. ఈ కార్యక్రమం నిర్వహణకు అవసరమైన నిధులు ఖర్చు పెట్టేందుకు జిల్లా కలెక్టర్, డిఇఓ పేర్లతో జాయింట్ అకౌంట్‌లో జమ చేశారు. డిఇఓ కార్యాలయంలో ఈ పథకానికి సంబంధించిన ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేశారు. కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఈ విద్యా పథకాన్ని విద్యాశాఖ సజావుగా నడిపితే బాగుంటుంది.



వైఎస్ జయంతిని పురస్కరించుకొని ఇడుపులపాయలోని ఆయన సమాధి వద్ద శ్రద్ధాంజలి ఘటిస్తున్న కావలి మాజీ ఎమ్మెల్యే మాగుంట పార్వతమ్మ.

# సంక్షేమ శాఖలకు పైసా విడుదల చేయలేదు!

వివిధ సంక్షేమ పథకాల అమలుకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వం నుంచి నిధుల విడుదల జరగడం లేదు. 2010 – 11 ఆర్థిక సంవత్సరం ఆరంభమయ్యి మూడు నెలలు గడుస్తున్నా ప్రభుత్వం నుంచి వివిధ సంక్షేమశాఖలకు పైసా కూడా విడుదల కాలేదు. గిరిజన సంక్షేమ శాఖ, బిసి కార్పొరేషన్, ఎస్సీ కార్పొరేషన్, వికలాంగుల సంక్షేమ శాఖల ఆధ్వర్యంలో పలు సంక్షేమ, అభివృద్ధి పథకాలు మంజూరవుతుంటాయి. బ్యాంకు నుంచి మంజూరు లేఖలు అందిన తర్వాత లబ్ధిదారునికి సబ్సిడీ మంజూరు చేస్తున్నారే తప్ప నిధులను మాత్రం విడుదల చేయడం లేదు. దీనికి కారణం బడ్జెట్‌లో పేర్కొన్నట్లు నిధులు విడుదల చేయకపోవడమే అనాలి. 2009 – 10 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి లబ్ధిదారులకు ఎస్సీ కార్పొరేషన్‌లో మూడు కోట్ల 57 లక్షల 90వేల రూపాయలను



నెల్లూరులోని సాంఘిక సంక్షేమ భవన్. (ఫైల్‌ఫోటో).

సబ్సిడీగా మంజూరు చేయడం జరిగింది. అయితే నిధుల కొరతగా రెండు కోట్ల 30 లక్షల రూపాయలే విడుదల చేశారు. ఇప్పటికీ గత సంవత్సరానికి సంబంధించి ఎస్సీ కార్పొరేషన్ ఒక కోటి 27 లక్షల 15వేల రూపాయలను వివిధ బ్యాంకులకు సబ్సిడీ నిధుల్ని జమ చేయాల్సి వుంది. గత ఏడాది బకాయిలు పేరుకొని వుండగా ఈ ఏడాది రుణ ప్రణాళిక ఖరారు చేయడం నిధుల విడుదల సందేహాస్పదమవుతుంది. బ్యాంకులకు బకాయిలుండడంతో తిరిగి రుణాలు మంజూరు చేసేందుకు బ్యాంకు అధికారులు వెనుకంజ వేస్తున్నారు. బిసి కార్పొరేషన్ గత ఏడాది రుణాలు మంజూరు చేసిన వారికి ఈ ఏడాది వాటిని ఇస్తున్నారు. గిరిజన సంక్షేమ శాఖలో గత ఏడాది మూడు కోట్ల 36 లక్షల 74వేల రూపాయల సబ్సిడీలు వార్షిక ప్రణాళికలో పొందుపర్చినా 39 లక్షల 97వేల రూపాయలు మాత్రమే ఖర్చు చేశారు. ప్రణాళికలు బారెడు, నిధులు మూరెడులా వివిధ ప్రభుత్వ శాఖల్లో మంజూరీలు జరగడం పట్ల లబ్ధిదారులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

# తుపాకీని కనిపెట్టలేని పోలీసు!



తుపాకీ మాయమైన నెల్లూరు ట్రెజరీ కార్యాలయం.

ఇంటి దొంగలను ఈశ్వరుడైనా పట్టలేడన్న సామెతను రుజువు చేస్తుంది పోలీసుల పనితీరు. జిల్లాలో దొంగతనాలను అరికట్టడంలో, నగరంలో ట్రాఫిక్ సమస్యను పరిష్కరించడంలో ఎస్పీ దామోదర్ ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్న సంగతి తెలిసిందే. ట్రాఫిక్‌కు అడ్డంగా వుంటున్నారని మద్రాస్ బస్టాండ్ వద్ద వుండే చిరు వ్యాపారులను అక్కడ నుంచి ఖాళీ చేయించాడు ఎస్పీ. అలాంటి అధికారి సొంత డిపార్ట్‌మెంట్‌లో కన్పించకుండా పోయిన తుపాకీని కనిపెట్టడంలో మాత్రం విఫలమయ్యాడనే చెప్పాలి. కొన్ని నెలల క్రిందట జిల్లా ట్రెజరీలో సెంట్రీ విధులు నిర్వహించే కానిస్టేబుల్ మద్యం మత్తులో తన తుపాకీని పోగొట్టుకొన్నాడు. దీన్ని వెతికి పట్టేందుకు డిఎస్పీ ఆధ్వర్యంలో బృందం తనిఖీలు నిర్వహించినా ఇంత వరకు ఆ తుపాకీ ఆచూకీ లభించక పోవడం పోలీసు శాఖలోని లొసుగులను, సిబ్బంది వైఫల్యాన్ని తెలియజేస్తుంది. లోడ్‌చేసిన గన్ కన్పించకుండాపోయి నెలలు గడుస్తున్నా ఉన్నతాధికారులకు చీమ కుట్టినట్లు కూడా లేకపోవడం పట్ల పలువురు ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నారు. అధికారుల మధ్య ఏర్పడిన వర్గ విభేదాల వల్ల కావాలని తుపాకీని మాయంచేసి వుండవచ్చనే అభిప్రాయం కొందరిలో వ్యక్తమవుతుంది. నిత్యం ప్రముఖులు పర్యటించే చోట పోలీసు కానిస్టేబుల్ పోగొట్టుకొన్న లోడ్‌చేసిన తుపాకీని కనిపెట్టలేని పోలీసులు ఇక సామాన్యులకు ఏవిధంగా భద్రత కల్పిస్తారన్న వ్యాఖ్యలు వినవస్తున్నాయి.

## సంక్షేమానికి ఆమడ దూరంలో...

# స్త్రీ శిశు సంక్షేమశాఖ!

**నిరాదరణకు గురైన మహిళలకు సేవాసదనం, బాలికా శిశు సంక్షేమ బీమా, కిశోరశక్తి యోజన, గృహ హింస చట్టం, అత్యాచారానికి గురైన మహిళలకు ఆసరా, పిల్లలను దత్తత తీసుకోను అనుమతి వంటి బృహత్తర పథకాలకు నేతృత్వం వహించాల్సిన శాఖ జిల్లాలో భ్రష్టు పట్టింది.**




నెల్లూరులోని స్త్రీ అభివృద్ధి మరియు శిశు సంక్షేమం బాలసదనం (ఫైల్‌ఫోటో).

మహిళల సంక్షేమం కోసం ఏర్పాటు చేసిన స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఆశించిన లక్ష్యాలను సాధించడంలో పూర్తిగా వైఫల్యం చెందుతున్నది. ఈ సంక్షేమ శాఖకు ప్రభుత్వం ప్రతి సంవత్సరం కోట్ల రూపాయల నిధులు విడుదల చేస్తున్నా వీటిని మహిళల అభివృద్ధికి ఏ మాత్రం వెచ్చించడం లేదు. జిల్లావ్యాప్తంగా స్త్రీలు ఎదుర్కొంటున్న పలు సమస్యలపై ఈ కార్యాలయ అధికారిణి దృష్టిసారించి త్వరితగతిన వాటిని పరిష్కరించే దిశగా చర్యలు చేపట్టాల్సి వుంటుంది.

అయితే మహిళలపై నిరంతర దాడులు, అఘాయిత్యాలు జరుగుతున్న విషయం వీరి దృష్టికి వచ్చినా కూడా గ్రామీణ ప్రాంతాలవైపు కన్నెత్తికూడా చూడడం లేదు. ఎంతసేపటికి అంగన్‌వాడి కేంద్రాల గురించి ప్రకటనలు చేస్తుంటారే తప్ప మిగిలిన కార్యక్రమాల అమలు గురించి పట్టించుకోవడం లేదు. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో అమలయ్యే కార్యక్రమాలు, పథకాల గురించి సామాన్య ప్రజానీకానికి ఇప్పటికీ తెలియదంటే ఆశ్చర్యపోక తప్పదు. జిల్లా కేంద్రాన్ని వదలి బయట ప్రాంతాలకు వెళ్లి కార్యక్రమాల అమలు తీరు గురించి పర్యవేక్షణ జరిపేవారు కనిపించడం లేదు.

### ఎన్నో పథకాలు!

స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో శిశు అభివృద్ధి పథకం అంటే అంగన్‌వాడీ కేంద్రాల నిర్వహణ, అనాథ బాలికలకు ఉచిత విద్య, భోజనం, నివాసం కొరకు బాలసదనాల నిర్వహణ, నిరాదరణకు గురైన మహిళల కోసం సేవాసదనం ఏర్పాటు, ఉద్యోగినుల కోసం వసతి గృహం, అనుబంధ పోషకాహారం సరఫరా, బాలికా శిశు సంరక్షణ బీమా పథకం, కిశోర శక్తియోజన పథకం, గృహహింస చట్టం, అత్యాచారానికి గురైన మహిళలకు ఆర్థిక సహాయం అందించడం, పిల్లలను దత్తత తీసుకొనేందుకు అనుమతి మంజూరు తదితర పథకాలను, కార్యక్రమాలు అమలుచేసే బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వం అప్పగించింది.

పథకాలు, కార్యక్రమాల పేర్లు బాగానే వున్నా ఆచరణ, అమలులోకి వచ్చేసరికి ఎవరికీ దక్కకుండా పోతున్నాయి. ఇందుకు కారణం ఈ కార్యాలయ అధికారుల నిర్లక్ష్యమని చెప్పవచ్చు. పై పథకాలు, కార్యక్రమాలు పటిష్టంగా అమలుచేసి మహిళల్లో మరింత చైతన్యం తీసుకు రావాలన్న ప్రభుత్వ సంకల్పానికి తూట్లు పడుతున్నాయి. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ పరిధిలో అమలయ్యే పథకాలు, కార్యక్రమాలను ప్రాజెక్టు డైరక్టర్ నిత్యం పర్యవేక్షణ చేయాల్సి వుంటుంది. అయితే ప్రాజెక్టు డైరక్టర్ ఆ దిశగా ఎప్పుడూ కృషిచేసిన దాఖలాలు కనిపించడం లేదు.

### తప్పులతడికలు - రికార్డులు!

జిల్లాలో నెల్లూరు, గూడూరు, కోట, వెంకటగిరి, సూళ్లూరుపేట ప్రాంతాలలో అయిదు బాలసదనాలు నిర్వహిస్తున్నా వీటిలో ఆరు నుంచి 18 సంవత్సరాలలోపు అనాథ బాలికలకు ఉచిత విద్య, భోజన వసతి, నివాసం కల్పిస్తున్నారు. ఒక్కో బాలసదన్‌లో 60 మంది బాలికలు వున్నట్లు రికార్డులు చెబుతుండగా వాస్తవానికి 20కి మించి బాలికలు కనిపించరు. ఇక్కడ వుంటున్న 9, 10 తరగతులు చదువుతున్న బాలికలకు కంప్యూటర్ శిక్షణ ఇస్తున్నట్లు అధికారులు చెబుతుండగా కంప్యూటర్ పరిజ్ఞానం గల బోధకుల నియామకం బాలసదన్‌లలో జరగకపోవడం విశేషం.

దాతల సహాయంతో విద్యార్థులకు అవసరమైన సామాగ్రిని అందించి ప్రభుత్వం నుంచి బిల్లులు డ్రా చేసుకుంటున్నట్లు తెలిసింది. లక్షలాది రూపాయలు వ్యయంచేసి కొనుగోలు చేసిన కంప్యూటర్లు పనికిరాకుండా పోయే ప్రమాదం ఏర్పడింది.

### బాలసదన్, సేవాసదన్‌లు ఘోరం!

బాలికల కోసం నిర్వహించే బాలసదన్‌ల పరిస్థితి పైవిధంగా వుండగా నిరాదరణకు గురికాబడిన మహిళలకు ఆశ్రయం కల్పించేందుకు ఏర్పాటు చేసిన సేవాసదన్‌ల పరిస్థితి మరో విధంగా వుంది. ఇక్కడ ఆశ్రయం పొందే మహిళలకు వివిధ వృత్తులలో శిక్షణ ఇచ్చి ఉచిత భోజన సదుపాయం కల్పించాల్సి వుంటుంది. మహిళలతోపాటు వారి పిల్లలకు సైతం ఇక్కడే వుంచి అన్ని వసతులు సమకూర్చాలి. వంద మంది మహిళలు, 50 మంది పిల్లలకు ఆశ్రయం కల్పించినట్లు నిర్వాహకులు చెబుతున్నారు. ఇక్కడ కూడా అవినీతి అక్రమాలు చోటు చేసుకుంటున్నాయి. ప్రస్తుతం సేవాసదన్‌లను అద్దె భవనంలో నిర్వహిస్తున్నారు. పక్కా భవనం కోసం ప్రభుత్వం 25 లక్షల రూపాయలు మంజూరు చేయడం జరిగింది. 2009 సంవత్సరంలో ప్రారంభించిన భవన నిర్మాణం నేటికీ పూర్తికాక అధికారుల నిర్లక్ష్యాన్ని వేలెత్తి చూపుతుంది. ఈ భవనం పూర్తి కావాలంటే అదనంగా మరో పన్నెండున్నర లక్షల రూపాయలు అవసరమని చెబుతున్నారు. ఇందుకు జిల్లా పరిషత్‌కు ప్రతిపాదనలు కూడా అందాయి.

ఇక్కడ ఆశ్రయం పొందే మహిళల పరిస్థితి చాలా దయనీయంగా మారింది. రక్త సంబంధీకులు, బంధువుల నిరాదరణకు గురికాబడిన వారు ఇక్కడ ఆశ్రయం పొందుతుంటే సేవాసదన్‌లో విధులు నిర్వహించే సిబ్బంది చాలా చులకనచేసే విధంగా వ్యంగ్యంగా మాట్లాడుతుంటారని మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. సమాజం చిన్నచూపు చూడడంతో ఇక్కడకు వస్తే అవమానకరంగా ప్రవర్తించి మరింత మానసిక క్షోభకు గురిచేస్తున్నా బయటకు చెప్పుకోలేక పోతున్నారు. వసతుల కల్పన, భోజన విషయంలో కూడా ఏమీ ప్రశ్నించకూడదన్న నిబంధన విధించారు. ఇష్టంలేని వారు ఇంటికి వెళ్లిపోవచ్చని హుకుం జారీ చేస్తున్నారు నిర్వాహకులు.

### శిశు సంరక్షణ బీమా ఏది?

బాలికా శిశు సంరక్షణ బీమా పథకం కూడా సక్రమంగా అమలు జరగడం లేదు. ఈ పథకం ద్వారా ఒక బాలిక కలిగి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకున్న దంపతుల పాప పేరున లక్ష రూపాయలు, ఇద్దరు బాలికలు కలిగిన వారికి ఒక్కొక్క బాలికకు 30వేల రూపాయల వంతున బీమా చేయాలి. 1996 సంవత్సరం నుంచి అమలవుతున్న ఈ పథకం నిధుల కొరత కారణంగా ముందుకు సాగడం లేదు. ఈ శాఖ అధికారులు ఆగష్టు 15, నవంబర్ 1, జనవరి 26 తేదీలలో మంజూరు పత్రాలు అందజేసి చేతులు దులుపుకుంటున్నారే తప్ప బీమాకు సంబంధించిన బాండ్లు మాత్రం జారీచేయడం లేదు.

2006 నుంచి 2009 సంవత్సరం వరకు దాదాపు అయిదు వేల మంది లబ్దిదారులను ఎంపిక చేయడం జరిగింది. వీరికి ఎప్పుడు బాండ్లు అందజేస్తారో అధికారులకే తెలియాలి. కిశోరశక్తి యోజన పథకం ద్వారా కిశోర బాలికలకు బాల్య వివాహాలు, అక్రమ తరలింపు, వరకట్న నిషేధం, ఆరోగ్యం, పోషణ, హెచ్ఐవి, ఎయిడ్స్ తదితర కార్యక్రమాలపై సదస్సులు ఏర్పాటుచేసి అవగాహన కల్పించాలని ప్రభుత్వం మార్గదర్శకాలు రూపొందించింది. దీనికి అవసరమైన నిధుల విడుదల కూడా జరిగింది. జిల్లా, మండలస్థాయిలలో ఈ సదస్సులు నిర్వహించాల్సి వుండగా ఇవి కూడా ఏర్పాటుచేసిన సందర్భాలు లేవు.

### శిక్షణకు మంగళం!

వీరి ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచుకునేందుకు వివిధ వృత్తులలో శిక్షణా కార్యక్రమాలు ఏర్పాటుచేస్తున్నట్లు అధికారులు చెబుతున్నా ఎక్కడ నిర్వహించేది మాత్రం వెల్లడించేందుకు నిరాకరిస్తున్నారు. ఇవి ఇలా వుండగా గృహహింస చట్టం అమలుచేసే బాధ్యతను కూడా ప్రభుత్వం ఈ శాఖకే అప్పగించడం మరో విశేషం. గ్రామీణ ప్రాంతాలతోపాటు, పట్టణ ప్రాంతాలు, వివిధ ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలలో పనిచేస్తున్న మహిళలు ఏదో ఒక రూపంలో హింసకు గురవుతుంటారు. ఇలా గురవుతున్న వారు రక్షణ కోసం రక్షణాధికారిగా వుండే ప్రాజెక్టు డైరక్టర్‌కు ఫిర్యాదు చేయాల్సి వుంటుంది. అయితే ఈ చట్టం అమలుచేసే వారికే దీనిపై సరైన అవగాహన లేకపోవడంతో బాధితులు కార్యాలయం మెట్లు ఎక్కడం లేదు. ఈ చట్టం అమల్లోకి వచ్చిన తర్వాత మహిళలకు ఎంతో రక్షణగా వుంటుందని భావించారు. కానీ గ్రామీణ ప్రాంతాలలోని కేసులన్నీ పోలీసుస్టేషన్లకే వెళుతున్నాయి తప్ప గృహహింస చట్టం క్రిందకు రావడం లేదు. ఈ చట్టంపై ప్రజలకు అవగాహన కల్పించడంలో ఈ శాఖ విఫలం చెందింది. ఫలితంగా ఏ లక్ష్యంతో అయితే ప్రభుత్వం ఈ చట్టం రూపొందించి అమలుకు శ్రీకారం చుట్టిందో ఆ లక్ష్యం నెరవేరకుండా పోతున్నది.

### పనిచేయని పి.డి

ప్రాజెక్టు డైరక్టర్‌గా రెండు సంవత్సరాల క్రితం శారదాదేవి బాధ్యతలు చేపట్టింది. ఈమె బాధ్యతలు తీసుకున్న తర్వాత ఈ శాఖ పరిధిలో చేపడుతున్న కార్యక్రమాలు నిలిచి పోయాయి. ఇటీవల జరిగిన జడ్పీ సర్వసభ్య సమావేశంలో ఈ శాఖ పనితీరుపై పలువురు ఎమ్మెల్యేలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేయడం జరిగింది. ప్రాజెక్టు డైరక్టర్ పని విధానం సరిగాలేదని ఆగ్రహం వ్యక్తం చేశారు. ప్రతి సమావేశంలో సమర్పించే నివేదికలనే తిరిగి అందిస్తున్నారని దీంట్లో ఎటువంటి మార్పులు లేవని దుయ్యబట్టారు. ఈ శాఖ ఆధ్వర్యంలో జరుగుతున్న కార్యక్రమాల గురించి ప్రజాప్రతినిధులకు ఎటువంటి సమాచారం వుండడం లేదని మండిపడ్డారు. ఒక్కోసారి ప్రజాప్రతినిధుల వైపు నుంచి ప్రశ్నల వర్షం కురవడంతో ప్రాజెక్టు డైరక్టర్ ఉక్కిరిబిక్కిరై పోయారు. ఈ శాఖ పనితీరుపై సమగ్రంగా చర్చించేందుకు ప్రత్యేక సమావేశం ఏర్పాటుచేయాలని నిర్ణయించడం జరిగింది.

ఎసి కారులో తిరుగుతూ నెలకోసారి గానీ, లేకుంటే మంత్రులు పర్యటనల సందర్భంగా మండల కేంద్రాలకు వెళ్తుంటారు. మిగిలిన సమయంలో కార్యాలయంలో అందుబాటులో వుండరు. కార్యాలయంలో సంప్రదిస్తే క్యాంపుకు వెళ్లారని చెబుతుంటారు. ఏ ప్రాంతానికి క్యాంపుకు వెళ్లింది మాత్రం ఎక్కడా నమోదు కాదు. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ పనితీరుపై జిల్లా కలెక్టర్ దృష్టి సారించి గాడిలో పెట్టాల్సిన అవసరం ఎంతైనా వుంది.



# కృష్ణపట్నం పోర్టు తృతీయ వార్షికోత్సవం!




పోర్టును ప్రారంభిస్తున్న యుపిఏ ఛైర్‌పర్సన్ సోనియాగాంధీ (ఫైల్‌ఫోటో).

అంతర్జాతీయ ప్రమాణాలతో రూపుదిద్దుకున్న కృష్ణపట్నం పోర్టు తూర్పు తీరానికే తలమానికమైంది. జిల్లా పారిశ్రామికంగా అభివృద్ధి సాధించేందుకు దోహదపడిన పోర్టు జూలై 17తేది మూడవ సంవత్సరంలోకి అడుగు పెడుతుంది. 2008జూలై 17తేదీన యూపిఏ ఛైర్‌పర్సన్ సోనియాగాంధీ చేతుల మీదుగా ప్రారంభోత్సవం జరుపుకున్న పోర్టు అనతికాలంలోనే ఆసియాలోనే అతిపెద్ద పోర్టుగా గుర్తింపు సాధించింది. ఒకటిన్నర సంవత్సరంలోనే రికార్డుస్థాయి ఎగుమతులు జరపడం విశేషం. తూర్పు ఆసియా దేశాలైన సింగపూర్, కొరియా, చైనా, జపాన్, మలేషియా తదితర దేశాలకు సరుకుల రవాణా ఈ పోర్టు నుంచి జరుగుతుంది. ఏడు బెర్తులతో వున్న పోర్టులో మరో 7 బెర్తుల నిర్మాణం చేపట్టారు. భారీ నౌకల రాకపోకలతో ఎగుమతుల సామర్థ్యం పెరిగింది. పోర్టు ఏర్పాటుతో జీవనోపాధి కోల్పోయిన కుటుంబాలకు పునరావాస కాలనీలు ఏర్పాటుచేసి వాటి అభివృద్ధికి అన్ని చర్యలు చేపడుతుంది యాజమాన్యం. మత్స్యకారుల పిల్లలకు సివిఆర్ ఫౌండేషన్ ద్వారా ఉన్నత చదువులకు సహాయసహకారాలు అందించి, ఉపాధి అవకాశాలు కల్పించడంతోపాటు. కృష్ణపట్నం, ముత్తుకూరు ప్రాంత అభివృద్ధికి విశేషంగా కృషి చేస్తోంది పోర్టు యాజమాన్యం.















స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు పొదలకూరు రోడ్డులోని వియాని హోమ్‌లో వికలాంగ పిల్లల చేత కేక్‌ను కట్ చేయిస్తున్న జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ.

## ఆత్మకూరు పోలీసుల్లో వర్గవిభేదాలు

ఆత్మకూరు డివిజన్‌లోని పోలీస్ స్టేషన్లలో వర్గపోరు తారాస్థాయికి చేరింది. పోలీసుల మధ్య గొడవలు రేగడానికి అవినీతి సొమ్ములో వాటాలే కారణమని చెప్పుకోవాలి. ఐరన్‌ఓర్ లారీల నుంచి లక్షల రూపాయల్లో మామూళ్లు అందుతుండడంతో పంపకాల్లో ఏర్పడిన విభేదాలు ఖాకీల మధ్య చిచ్చురేపాయి.

ఒక్కో లారీ నుంచి కార్డు పేరిట నెలకు 65వేల రూపాయలు వసూలు చేస్తున్నారు. అందులో నెల్లూరు – ముంబాయి రహదారిపై వుండే ఒక్కో పోలీస్ స్టేషన్‌కు నెలకు ఐదు లక్షల వరకు ఆదాయం వస్తుంటుంది. మర్రిపాడు, ఆత్మకూరు పోలీస్ స్టేషన్లకు ఈ ఆదాయం రెండింతలు. ఈ మొత్తంలో 3.50 లక్షలు డిఎస్పీకి, 2.50 లక్షలు సిఐకి, రెండు సేషన్ల ఎస్‌ఐలకు చెరో లక్షరూపాయలు పోను మిగిలిన మొత్తంలో ఎఎస్‌ఐ, హెడ్‌కానిస్టేబుళ్లు, కానిస్టేబుళ్లు పంచుకొంటారట. ఇంత వరకు బాగానే వున్నా నెలసరి కార్డులు తీసుకోని లారీల వద్ద మామూళ్లు దండే వ్యవహారంలో పోలీసుల మధ్య విభేదాలు నెలకొన్నాయి. రెండుగా చీలిన ఖాకీలను అధికారులు ప్రోత్సహిస్తుండడంతో పోలీసులు లంచాల సొమ్ము కోసం కాట్ల కుక్కల్లా మారడం పోలీసు డిపార్టుమెంటు పరువు ఐరన్‌ఓర్ లారీల చక్రాల క్రింద నలిగిపోతుంది.

## మూలనపడ్డ ఇన్వర్టర్లు

జిల్లాలోని ప్రభుత్వ సంక్షేమ వసతి గృహాల్లోని విద్యార్థులకు మెరుగైన సౌకర్యాల సంగతి అటుంచితే వున్న వసతులు, సౌకర్యాలు కనుమరుగౌతున్నాయి. విద్యార్థుల చదువుకు ఆటంకం కలగకూడదన్న ఉద్దేశ్యంతో హాస్టళ్లలో ఏర్పాటుచేసిన ఇన్వర్టర్లు మూలనపడ్డాయి. మూడేళ్ల క్రిందట అప్పటి జిల్లా కలెక్టర్ రవిచంద్ర 14 లక్షల రూపాయలు వెచ్చించి 146 ఎస్సీ, 84 బిసి, 25 ఎస్టీ వసతి గృహాలు, మూడు ఆనందనిలయాలు మొత్తం 258 హాస్టళ్లలో పిల్లలు చదువుకునేందుకు ఆటంకం కలగకూడదన్న ఉద్దేశ్యంతో ఇన్వర్టర్లను ఏర్పాటు చేశారు. ఒక ఏడాదిపాటు సక్రమంగా పని చేశాయి. ఆ తర్వాత అవి మరమ్మత్తులకు గురికావడం ఎవరూ వాటి గురించి పట్టించుకోకపోవడంతో మూలనపడ్డాయి. ఇన్వర్టర్ల నిర్వహణపై వార్డెన్లకు అవగాహన లేకపోవడం, ఆ పరికరాలను సరఫరా చేసిన కాంట్రాక్టర్ పట్టించుకోకపోవడంతో లక్షలు వెచ్చించి కొనుగోలు చేసిన ఇన్వర్టర్లు నిరుపయోగంగా మారాయి. సదుద్దేశంతో ఏర్పాటుచేసిన వీటిని మరమ్మత్తులు చేయించి తిరిగి విద్యార్థులకు అందుబాటులోకి తేవాలని పలువురు విద్యార్థుల తల్లిదండ్రులు కోరుకొంటున్నారు.

## స్కూలు భవనాలకు నాబార్డు నిధులు

నాబార్డు నిధులతో జిల్లాలోని ఆరు ఉన్నత పాఠశాలలకు నూతన భవనాలను నిర్మిస్తున్నట్లు ఎజిఎం లక్ష్మణస్వామి తెలిపారు. 5.30 కోట్ల రూపాయలతో ఈ భవనాలు ఏర్పాటు కానున్నాయన్నారు. నాయుడుపేట ఉన్నతపాఠశాలకు 77 లక్షలు, అంబాపురం ఉన్నత పాఠశాలకు 85లక్షలు విడుదల చేస్తున్నట్లు చెప్పారు. ఇంజనీరింగ్ శాఖ అనుమతి కోసం ఎదురు చూస్తున్నామని, అనుమతి రాగానే నిర్మాణ పనులను చేపట్టనున్నట్లు తెలిపారు. ఈ సందర్భంగా ఆయన నాయుడుపేటలో నిర్మిస్తున్న పాఠశాల అదనపు గదులను పరిశీలించారు.

## సర్పంచ్‌లకు పెరిగిన జీతం

గ్రామ పంచాయితీ సర్పంచ్‌లకు గౌరవ వేతనం పెరిగింది. 600 రూపాయలుగా వున్న ఈ మొత్తాన్ని 1000 రూపాయలు చేస్తూ ప్రభుత్వం జీవో విడుదల చేసింది. దీంతో సర్పంచ్‌లు ఇక నుంచి 1000 రూపాయలు అందుకోనున్నారు. మేజర్ పంచాయితీ సర్పంచ్‌లకు మరికొంత అదనంగా లభించనుంది.

# ట్రిపుల్ ఐటి సీట్లలో మొండిచేయి!

ప్రతిష్టాత్మక ట్రిపుల్ ఐటి విద్యాసంస్థకు ఈ ఏడాది జరిగిన ఎంపికల్లో జిల్లాలోని ఐదు మండలాలకు ప్రాతినిధ్యం లభించలేదు. మొత్తం 46 మండలాల్లో 41 మండలాల విద్యార్థులకు ట్రిపుల్ ఐటిలో ప్రవేశం లభించగా, విడవలూరు, కొడవలూరు, మనుబోలు, బాలాయపల్లి, ఓజిలి మండలాలకు చెందిన విద్యార్థులకు అవకాశం దక్కలేదు. ట్రిపుల్ ఐటిలో పూర్తి స్థాయిలో వసతులు లేవన్న సాకుతో గతంలో వున్న ఆరు వేల సీట్లను మూడు వేలకు ప్రభుత్వం కుదించింది. గత సంవత్సరం జిల్లా నుంచి 200 మంది ఎంపిక కాగా, ఈ ఏడాది వీరి సంఖ్య 109కి పడిపోయింది. గతంలో మండలాన్ని యూనిట్‌గా తీసుకొని ప్రతిభ కలిగిన వారిని ఎంపిక చేశారు. ఈ దఫా మార్కులు, రిజర్వేషన్లు, తదితర పద్ధతులను అవలంభించడంతో పై ఐదు మండలాలకు ప్రాతినిధ్యమే లేకుండా పోయింది. అధికారులు వ్యవహరించిన విధానం సక్రమంగా లేకపోవడం వల్ల తమ మండలాలకు చెందిన విద్యార్థులకు ట్రిపుల్ ఐటిలో అవకాశం లభించలేదని ఆయా మండలాల లోని ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు.

**ఐదు మండలాల విద్యార్థులు ఎంపిక కాలేదు**

# జాతీయ రహదారిపై జర జాగ్రత్త!

మనుబోలు మండల పరిధిలో పోర్టు రోడ్డు నుంచి బద్దెవోలు క్రాస్‌రోడ్డు వరకు షుమారు 15 కిలోమీటర్ల మేర వుండే జాతీయ రహదారి ప్రమాదాలకు నిలయంగా మారింది. ఈ ప్రాంతంలో తరచూ మరమ్మత్తుల పేరుతో ట్రాఫిక్‌ను ఒకే మార్గంలో మళ్లిస్తుండడంతో ప్రమాదాలు ఎక్కువగా జరుగుతున్నాయి. ఒకే మార్గంలో వాహనాలు ఎదురెదురుగా వస్తుండడంతో పలువురు ప్రమాదాలకు గురై మృత్యువాత పడుతున్నారు. గత ఏడాది ఈ మార్గంలో జరిగిన ప్రమాదాల్లో పదుల సంఖ్యలో ప్రాణాలు పోగొట్టుకొన్నారు. మితిమీరిన వేగంతో వాహనాలు వస్తుండడం, ట్రాఫిక్‌ను మళ్లించడం ప్రమాదాలకు కారణమవుతున్నాయి. దీనికి తోడు బద్దెవోలు క్రాస్‌రోడ్డు నుంచి పోర్టు రోడ్డు వరకు మధ్యలో పలు క్రాస్ రోడ్డులు కలుస్తుండడంతో తరచూ ప్రమాదాలు జరుగుతున్నాయి. ఈ ప్రాంతం ప్రమాదాలకు కేంద్రంగా మారినప్పటికి సంబంధిత అధికారులు రక్షణ చర్యలు చేపట్టడంలో నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తుండడం విమర్శలకు తావిస్తోంది.

**మరమ్మత్తుల పేరిట ఒకవైపే ట్రాఫిక్**

● కోవూరు

# తాగునీటికి 75లక్షలు

## సాధించిన ప్రసన్న

కోవూరు నియోజకవర్గంలో వివిధ ప్రాంతాల్లో త్రాగునీటి సమస్యను పరిష్కరించేందుకు ప్రభుత్వం నిధులు మంజూరు చేసింది. మొత్తం 75 లక్షల రూపాయలు త్రాగునీటి కోసం విడుదలయ్యాయని ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి తెలిపారు. బుచ్చిరెడ్డిపాళెం టౌన్ ఖాజానగర్‌కు 25 లక్షలు, కొడవలూరు మండలం యల్లాయపాళానికి 20 లక్షలు, విడవలూరు మండలం కంచరపాళానికి 11లక్షలు, కోవూరు మండలం లేగుంటపాడుకు 10లక్షలు రూపాయల వంతున నిధులు విడుదలైనట్లు చెప్పారు. అలాగే ఐటిడిఏ ద్వారా బుచ్చి మండలం పోలినాయుడు చెరువు గ్రామానికి 3లక్షలు, జొన్నవాడ పాతగిరిజన కాలని, క్రొత్త గిరిజన కాలనీలకు 1.5 లక్షలు విడుదలయ్యాయని ఈ మొత్తాలతో త్రాగునీటి సమస్య పరిష్కారానికి కృషి చేస్తామన్నారు.

# తిప్పలో పోలీసు సోదాలు!

దొంగలు, నేరస్తులకు పేరుగాంచిన కప్పరాళ్లతిప్ప పోలీసుల సంచారంతో వణుకుతుంది. ఇటీవలే పేరుమోసిన దొంగను ఎన్‌కౌంటర్‌లో పోలీసులు హతమార్చడంతో సంచలనం కల్గిన విషయం తెలిసిందే. ఈ పరిస్థితులలో ఇటీవల కర్నాటక పోలీసులు, నెల్లూరు పోలీసులతో కలసి తిప్పలో సంచరించడంతో ఒక్కసారిగా స్థానికులు ఉలిక్కిపడ్డారు. కర్నాటకలో దొంగతనం కేసులో ఒక దొంగను పట్టుకోవడంతో అతను ఇచ్చిన సమాచారంతో కర్నాటక పోలీసులు రూరల్ డిఎస్పీ రవికుమార్, సిఐ, ఎస్‌ఐలను వెంటబెట్టుకొని తిప్పలో సోదాలు చేశారు. స్థానికంగా వుండేవారిని పిలిచి క్షుణ్ణంగా తనిఖీ చేసి వారు ఏ ఏ పనులు చేస్తున్నారు, ఎట్లా బ్రతుకుతున్నారు అనే దానిపై ఆరా తీశారు. అనుమానితుల ఫోటోలు తీసుకొన్న అనంతరం సత్ప్రవర్తనతో మెలగాలని, పిచ్చివేషాలు వేస్తే కఠినంగా వ్యవహరించాల్సి వుంటుందని పోలీసులు తీవ్ర హెచ్చరికలు చేశారు. డిఎస్పీ రవికుమార్ మాట్లాడుతూ తిప్ప నేరస్తులు ఇతర రాష్ట్రాల్లో పలు దొంగతనాలు, హత్యలు, దోపిడీల్లో పాలుపంచుకొంటున్నారని అలాంటి వారిపై నిఘా పెంచుతున్నట్లు చెప్పారు.

# రామస్వామిపల్లిలో మరుభూమి దురాక్రమణ!

ఆత్మకూరు మండలం రామస్వామిపల్లెలోగల స్మశాన స్థలం ఆక్రమణలకు గురౌతున్నది. సర్వే నెంబర్ 361, 363లో 30 ఎకరాల్లో వున్న స్మశానాన్ని కొందరు కొంచెం కొంచెంగా ఆక్రమించి వేస్తున్నారని స్థానికులు వాపోతున్నారు. దీనిపై పలుమార్లు అధికారులకు విన్నవించు కొన్నా ఫలితం లేకుండా పోయిందని ఇప్పటికైనా స్పందించి స్మశానాన్ని ఆక్రమణల చెర నుంచి కాపాడాలని స్థానికులు కోరుకొంటున్నారు. అలాగే పలువురు వృద్ధులు, వితంతువులకు పెన్షన్ అందడం లేదని, అర్హుల పేర్లు తొలగించారని దీనిని గుర్తించి పెన్షన్ మంజూరు చేయాలని వారు కోరుతున్నారు.

**● ఎంత దుస్సాహసం**

## జగన్ మీడియా ప్రమోటర్లు



వైఎస్ తనయుడు జగన్ మీడియాను ఓ పథకం ప్రకారం వాడుకుంటున్నాడు. ఓదార్పు యాత్ర పట్ల వస్తున్న విమర్శల్ని తిప్పికొట్టడానికి తన వీరవిధేయులతో ఓ ప్యానల్‌ను తయారు చేశాడు. అంబటి రాంబాబు, గట్టు ప్రసాద్, సినీ నటుడు విజయచందర్, నెల్లూరీయుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ప్రభృతులు ఈ ప్యానెల్‌లో వున్నారు. ఓదార్పు యాత్రకు సంబంధించి వివిధ ఛానెళ్లలో ప్రత్యేక చర్చా కార్యక్రమాల్ని ఏర్పాటుచేసి దానికి తగిన పారితోషికం కూడా చెల్లిస్తున్నారు. ఈ కార్యక్రమాల్ని 'జగన్మోహనం'గా తీర్చిదిద్దడానికి వీలుగా జగన్ ప్యానల్‌లోని సభ్యుల్ని ఇందులో భాగస్వాములుగా చేస్తున్నారు. పెయిడ్ కార్యక్రమాల్లో జగన్ మద్దతుదారులు చేస్తున్న నానా యాగీకి కాంగ్రెస్ సీనియర్లు ముక్కుమీద వేలేసుకుంటున్నారు. ఎమ్పీ హనుమంతరావు కూడా జగన్ ప్యాకేజీ కార్యక్రమాల పట్ల ఆశ్చర్యపోతున్నాడట.

## డిఎస్ ఎదురీత



ఉప ఎన్నికల్లో పిసిసి చీఫ్ డి.శ్రీనివాస్ ఎదురీదుతున్నాడు. తెలంగాణవాదం బలంగా వున్న నిజామాబాద్ అర్బన్‌లో హిందూ, ముస్లిం ఓట్లు గణనీయంగా వున్నాయి. గత ఎన్నికల్లో ముస్లింలపై విపరీత వ్యాఖ్యానం చేసి ఓటమి పాలయ్యాడు. ఈ చేదు అనుభవం నుంచి తేరుకోకముందే ఉప ఎన్నికలు బరిలో నిలవాల్సి వచ్చింది. ఇప్పుడేమో తన కులస్తులంతా తప్పనిసరిగా ఓటేసి గెలిపించాలంటూ ప్రచారం చేస్తూ ఎన్నికల కమిషన్‌కు దొరికిపోయాడు. దీనిపై కమిషన్ వివరణ కోరింది. డిఎస్ వివరణ ఇచ్చాడు. అయితే ఇది సరిగా లేదంటూ కమిషన్ కన్నెర్ర చేసింది. దీంతో డిఎస్ ఖంగుతిన్నాడు. ఇదిలా వుండగానే సోనియా త్వరలోనే తెలంగాణ ఇచ్చేస్తారంటూ కొత్త నినాదం ఎత్తుకున్నాడు. ఇలాగైనా తెలంగాణవాదుల్ని తృప్తి పరచాలన్నది డిఎస్ వ్యూహం. అయితే దానిపై కూడా టిఆర్ఎస్ ఫిర్యాదు చేయబోతోందట. అధికారపార్టీ చీఫ్ ఈవిధంగా హామీ యివ్వడం ఎన్నికల నిబంధనల్ని అతిక్రమించడమేనన్నది వారి వాదన. ఎన్నికల కమిషన్ ఏమంటుందో ఏమో! పాపం! డిఎస్!!

## రోశయ్య ఢిల్లీ యాత్రలో మతలబు!



ఒక ప్రక్క అసెంబ్లీ జరుగుతోంది. ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టడానికి ప్రతిపక్షాలు సర్వశక్తుల్ని మోహరిస్తున్నాయి. ఈ పరిస్థితుల్లో రోశయ్య హుటాహుటిన బయలుదేరి ఢిల్లీ వెళ్లడం వెనుకవున్న మతలబు పట్ల రాజకీయవర్గాల్లో వాడివేడి చర్చలు మొదలయ్యాయి. ఢిల్లీలో బుధవారంనాడు ఓ సమావేశంలో పాల్గొనాల్సి వుందని సిఎం పేషీ చెబుతున్నా... అధిష్టానం అర్జెంటుగా బయలుదేరి రమ్మన్నదని రాజకీయ వర్గాలంటున్నాయి. ఇందుకు తగినట్లుగానే రోశయ్య అర్ధరాత్రి సోనియా రాజకీయ సలహాదారుడు అహ్మద్ పటేల్‌ను కలుసుకొని సుదీర్ఘంగా చర్చించారు. పనిలో పనిగా జగన్‌కు వత్తాసుపలుకుతున్న వారి జాబితాను కూడా అందించారట. ప్రస్తుతం ఈ జాబితా అధిష్టానం పరిశీలనలో వుంది. పరిస్థితిలో మార్పు రాకపోతే జగన్‌పైన, ఆయన మద్దతుదారులపైన వేటుపడే అవకాశం ఉందంటున్నారు. పాపం రోశయ్య... ఏ మూహూర్తాన సిఎం కుర్చీ ఎక్కాడో కానీ సుఖం లేకుండా పోయిందని ఆయన సన్నిహితులు వాపోతున్నారు. ప్చ్! ఏంచేద్దాం!

## జగన్‌కు కెవిపి బుజ్జగింపు



షార్ కేంద్రం నుంచి నిప్పులు చిమ్ముతూ నింగికెగిసి పోతున్న పిఎస్ఎల్‌వి సి-15 రాకెట్.



పిఎస్ఎల్‌వి సి-15 ప్రయోగ విజయం తర్వాత మీడియా సమావేశంలో రాకెట్ నమూనాతో ఇస్రో ఛైర్మన్ రాధాకృష్ణన్, ప్రయోగంలో పాలుపంచుకొన్న శాస్త్రవేత్తలు.



నెల్లూరులో ప్రభుత్వ నేతృత్వంలో జరిగిన వైఎస్ జయంతి వేడుకల్లో ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి, ఎమ్మెల్యే వివేకా, కలెక్టర్ రాంగోపాల్, మేయర్ భానుశ్రీ తదితరులు.



నెల్లూరు రాజీవ్‌భవన్ నేతృత్వంలో జరిగిన వైఎస్ జయంతి వేడుకల్లో పేదలకు బట్టల పంపిణీ చేస్తున్న అనిల్.

ఓదార్పు యాత్ర ప్రారంభంలో జగన్ దూకుడుగా పోయినా ప్రస్తుతం నెమ్మదించాడు. దీనిపై రాజధానిలో రకరకాల ఊహాగానాలు వినవస్తున్నాయి. ఓదార్పు యాత్రలో జనం మద్దతు చూసి ఎమ్మెల్యేలు విరగబడి వస్తారని జగన్ ఊహించాడు. అయితే ఎమ్మెల్యేలు మాత్రం ఉత్సాహం చూపలేదు. దీంతో జగన్ పునరాలోచనలో పడ్డాడు. అయితే తూర్పుగోదావరి జిల్లాలో మాత్రం కొందరు ఎమ్మెల్యేలు జగన్‌కు బాసటగా నిలిచారు. ఓదార్పు యాత్రలో జగన్‌కు ఇది గుడ్డిలో మెల్లగా వుంది. ఈలోగా అధిష్టానం నుంచి కె.వి.పి.కి వర్తమానం అందింది. జగన్‌కు నచ్చచెప్పుకోండి, లేకపోతే పరిణామాలు తీవ్రంగా ఉంటాయన్నది దాని సారాంశం. కె.వి.పి అధిష్టానం పంపిన వర్తమానాన్ని జగన్‌కు చేర వేశాడు. పరిస్థితులు కుదుటపడే వరకు నెమ్మదించాలని, అధిష్టానంపై విమర్శలు మానుకోవాలంటూ జగన్‌కు నచ్చ జెబుతున్నాడట. దీంతో జగన్ కూడా స్పీడు తగ్గించాడని అంటున్నారు. ఓదార్పు యాత్ర ముగించుకొని రాజధానికి వచ్చాక వ్యూహ రచన చేద్దామంటూ జగన్ తన మద్దతుదారులకు చెబుతున్నాడట చూద్దాం! ఏం జరుగుతుందో!!



● సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆరాధనతో

# గౌరీశంకరుల కటాక్షం!

గౌరీశంకరుల మంగళకర ప్రేమకు, అనుగ్రహానికి ఐక్య రూపం సుబ్రహ్మణ్యేశ్వరస్వామి. షణ్ముఖుడు, కార్తికేయుడు, వేలాయుధుడు, కుమారస్వామిగా పేరు గడించిన స్వామి కారణజన్ముడు. తారకాసురుడు, సురావణుడు తదితర రాక్షసులు లోకకంటకులై ప్రజలను, దేవతలను నానా రకాలుగా హింసిస్తుంటారు. వారి నుంచి కాపాడమని బ్రహ్మను కోరగా ఆయన శివ పార్వతులకు జన్మించే పుత్రుడు వారిని వధిస్తాడని చెప్తాడు. ఆ రకంగా పార్వతి పరమేశ్వరుల అనుగ్రహంతో కుమారస్వామి పుట్టుక విలక్షణమైనది. శివాంశతో జన్మించిన సుబ్రహ్మణ్యస్వామి గంగాదేవి గర్భంలో పెరుగుతాడు. గంగ ఆ పుత్రుని భారం మోయలేక రెల్లు పొదల్లో జారవిడుస్తుంది. అప్పుడు కృత్తికా దేవతలు ఆరుగురు తమ స్తన్యమిచ్చిపెంచుతారు. రెల్లు పొదల్లో పెరిగినందున శరవణుడని, కృత్తికా దేవతలు పెంచినందువలన కార్తికేయుడని పేరు వచ్చిందని పురాణాలు చెప్తున్నాయి. ఆరు ముఖాలు కల్గినందువల్ల షణ్ముఖుడని అంటారు. నెమలి వాహనంగా కల్గిన స్వామి గణేశునికి సోదరుడు. ఆరు ముఖాలలో ఐదు పంచేంద్రియాలకు, ఒకటి మనస్సుకు ప్రతీకగా ఆధ్యాత్మికత అవలోకిస్తుంది. స్వామి అనే నామధేయం సుబ్రహ్మణ్యేశ్వర స్వామికి మాత్రమే సొంతం. సేనాధిపతిగా సకల దేవ గణాలచేత పూజలు అందుకొనే సుబ్రహ్మణ్యుని అనుగ్రహం పొందితే గౌరీశంకరుల కటాక్షం లభిస్తుందని ప్రతీతి. తారకాసురుని సంహరించిన కుమారస్వామి మార్గశిర మాసం శుక్లపక్ష షష్ఠినాడు జన్మించాడు. ఆరు ముఖాలు, 12 చేతులు సూర్యతేజస్సుతో జన్మించిన షణ్ముఖుని ఆరాధించడం వలన సమస్తదోషాలు తొలగి, శుభాలు కల్గుతాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం. ఆషాడమాస శుక్లపక్ష పంచమి, షష్ఠిని పర్వదినాలుగా జరుపుకొంటారు. శుక్లపక్ష పంచమిని స్కంద పంచమని, షష్టిని కుమార షష్టిగా భావించి భక్తులు ఆ రెండు రోజులు విశేష పూజలు చేస్తారు. పంచమినాడు ఉపవాసం వుండి, షష్టినాడు కుమారస్వామిని పూజించినట్లయితే నాగ దోషాలు తొలగుతాయని, జ్ఞానవృద్ధి కల్గుతుందని, కుజదోషాలు తొలగుతాయని, సంతానం కల్గుతుందని నమ్మకం.

*హే స్వామినాథ కరుణాకర దీనబంధో*
*శ్రీ పార్వతి సుముఖ పంకజ పద్మబంధో*
*శ్రీ శాది దేవగణాధిత పాదపద్మ*
*వల్లీ సనాథ మమ దేహి కరావలంభమ్*

అంటూ సుబ్రహ్మణేశ్వరుని పూజించినట్లయితే సకల దోషాలు తొలగి సకల శుభాలు కల్గుతాయి.

17తేది కుమారషష్ఠి సందర్భంగా...

## ట్రంకు రోడ్డు

## ఆకట్టుకోని జర్నలిస్టులు!



సృజనాత్మకత లేని వ్యక్తి జర్నలిస్టుగా రాణించలేరు. జర్నలిస్టుల్లో రకరకాల కళలు దాగుంటేగాని వారు తమ వృత్తిని ప్రతిభావంతంగా నిర్వహించలేరని ప్రతీతి. ఎపియూడబ్ల్యుజె నెల్లూరుజిల్లా శాఖ జర్నలిస్టుల్లో దాగుండే కళలను వెలికితీయను పలు కార్యక్రమాలను నిర్వహిస్తుంది. దానిలోభాగంగా ఈవారం నిర్వహించిన ఏకపాత్రాభినయాలు, పాటలు పోటీలకు అటు జనంతోపాటు ఇటు జర్నలిస్టుల నుంచి ఆదరణ కరవయ్యింది. అంత పెద్ద టౌన్‌హాల్‌లో ప్రదర్శకులు తప్ప వీక్షకులు లేకపోవడం బాధనిపించింది. కాని నిర్వాహకులు మాత్రం డోంట్‌కేర్ రీతిలో ఈ కార్యక్రమం అయ్యిందనిపించారు. ఈ ప్రదర్శనలో పాతతరం హరిశ్చంద్ర, మాయలఫకీర్లు, నక్కలోళ్ల పాత్రలను పట్టుకొని జర్నలిస్టులు ఊగులాడడమేమి? వ్రాత మారిన వార్తల మాదిరే సరికొత్త పాత్రలు సృష్టించలేరా??

## షామియామానాలు... అయ్యోర్లు!



షామియానాలకు అయ్యోర్లకు లింకేమిటి అనుకొంటే జిల్లా కలెక్టర్ రాంగోపాల్ చెప్పిన మాటలు వినాల్సిందే. ప్రభుత్వ పాఠశాలల్లో పనిచేసే అయ్యోర్ల గూర్చి బహు చమత్కారంగా చెప్పుకొచ్చారాయన. అయ్యోర్లు మాసంలో సగం రోజులు డిఇఓ ఆఫీసు ముందు, మరో సగం రోజులు కలెక్టర్ కార్యాలయం ఎదుట షామియానాలు వేసుకొని ధర్నాలు చేయడానికే సమయం సరిపోతుంది. మిగతా రోజుల్లో పిల్లలకు వాళ్లు చెప్పేది స్వల్పం. ఉపాధ్యాయులు తమ తీరును మార్చుకొని పిల్లలకు పాఠాలు చెప్పడంపై శ్రద్ధపెడితే కార్పొరేటు స్కూళ్లు మూసుకోవాల్సిందేనన్నారు. 'ఉత్తేజిత' కార్యక్రమంలో కలెక్టర్ చేసిన ఈ వాఖ్యలు కలకలం సృష్టించాయి.

## వెంకన్న పాదపూజలో పిఎస్‌ఎల్వీ!



అద్భుత రోదసీ రహస్యాలను విప్పి చెప్పేవి రాకెట్ ప్రయోగాలు. శ్రీహరికోటలోని షార్ కేంద్రం నుంచి ఇప్పటికి లెక్కలేనన్ని రాకెట్ ప్రయోగాలు జరిగాయి. పాత ఇస్రో ఛైర్మన్ కస్తూరిరంగన్ ఎంత గొప్ప శాస్త్రజ్ఞుడో అంతే స్థాయిలో దైవభక్తుడు. పిఎస్‌ఎల్వీ సీరీస్‌లో ప్రయోగించే ప్రతి రాకెట్ నమూనాను కలియుగ దైవం వెంకటేశ్వరస్వామి, సూళ్లూరుపేట గ్రామ దేవత చెంగాళమ్మల పాదసన్నిధిలో పెట్టించి ప్రయోగానికి ముందు పూజ చేయడం అలవాటు. దీన్ని కొత్త ఛైర్మన్ రాధాకృష్ణన్ సైతం అనుసరిస్తున్నారు. పిఎస్‌ఎల్వీ–సి15 రాకెట్ ప్రయోగానికి ముందు ఆయన వెంకన్న సుప్రభాత సేవలో పాల్గొని రాకెట్ నమూనాకు పూజ చేయించగా, ఆయన సతీమణి చెంగాళమ్మ సన్నిధిలో ఆ కార్యక్రమాన్ని పూర్తి చేయించారు. మొత్తానికి ఈ ప్రయోగం విజయవంతమయ్యింది. ఇది ఎవరి ఘనత అంటూ హేతువాదులు తమ ధోరణిలో సణుగుతున్నారు.

## పోటా పోటీగా వైఎస్ జయంతి



దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి 61వ జయంతిని నెల్లూరు నగరంలో కాంగ్రెస్‌వాదులు తమ చిత్తానుసారంగా నిర్వహించారు. ఆనం సోదరుల గ్రూపుకు చెందిన కార్పొరేటర్లు నలుపు తెలుపు ఫ్లెక్స్‌బోర్డులు నగరమంతా పెట్టేశారు. వీరికి పోటీగా రాజీవ్‌భవన్ నిర్వాహకులు కేక్ కట్‌చేసి పేదలకు బట్టలు పంపిణీ చేశారు. పార్టీలోని మైనార్టీసెల్ నేతలు తమ మనస్సుకు నచ్చిన రీతిలో బిరియాని వితరణ చేశారు. వీరితో సంబంధం లేకుండా కొన్ని ప్రాంతాల్లో వైఎస్ అభిమానులు అపరిమిత అన్నదాన కార్యక్రమాలను ప్రచారానికి దూరంగా చేయడం అందరినీ ఆకర్షించింది.

## వాస్తవం మాట్లాడిన మేయర్



నెల్లూరు మేయర్ నందిమండలం భానుశ్రీ చాలారోజుల తర్వాత ఓ నిజాన్ని ఒప్పుకున్నారు. అదేమిటంటే కార్పొరేషన్ సిబ్బంది తన మాట వినడం లేదని. నా డివిజన్‌లోనే వీధిలైట్లు వెలగడం లేదు. నా డివిజన్‌లోనే ఇలా వుంటే మిగతా డివిజన్ల పరిస్థితి ఏమిటి? నగరాభివృద్ధికి కోట్లాది రూపాయల నిధులు తెస్తుంటే పనులు చేయడంలో వుదాసీనవైఖరి ప్రదర్శిస్తున్నారు. సిబ్బంది తమ పద్ధతి మార్చుకోకుంటే ఊరుకొనేది లేదన్నాదావిడ. పనిచేయకుండా నిధులను వుట్రవుడియంగా మింగేస్తుంటే ఆ ఫైళ్లపై ఉద్యోగులు ఏవిధంగా సంతకాలు పెడతారమ్మా?




సంతాన మూలంగా ఉత్సాహకరమైన వార్త వింటారు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. ధనాదాయవిషయంలో లోటు ఉండదు. పురోభివృద్ధి అన్ని రంగాలలో ఉంటుంది. రాజకీయులకు అత్యంతం అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాలనార్జిస్తారు. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు. నూతన వస్త్రాభరణ ప్రాప్తికి అవకాశాలున్నాయి.




ధనవిషయంలో కూడ కటకట తొలగవచ్చు. సోదరులతో అభిప్రాయభేదావకాశాలు. ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. ఇంటిలో వివాహ సంబంధవిషయాలు ప్రస్తావనకు వస్తాయి. విద్యార్థులకు ఒక విధంగా చదువు సాగుతుంది. రాజకీయులకు దురదృష్టకాలం.




వాహనాలు జాగ్రత్తగా నడపాలి. మిత్రులు సాయమందిస్తారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటుంది. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. భూభవనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం. రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ.




అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకున్నా ఏదో లోపం ఉన్నట్టు తోస్తుంది. ఆహారవిషయంలో జాగ్రత్త. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. చిరకాలంగా ఎదురుచూస్తూవచ్చిన శుభఫలితాలు అనుభూతిలోకి వస్తాయి. శత్రువులు లొంగి నడచుకొంటారు. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం గాదు. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త.




ముందుచూపుతో అడుగేయాలి. ఆచరణలో సాధ్యంకాని రీతిలో ఆలోచిస్తారు. ఇతరులు బాధపడేరీతిలో నడుచుకోవద్దు. సంతానమూలంగా ఇబ్బందులుండవచ్చు. గుట్టుగా కాలం గడపడం మంచిది. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. వ్యాపారులు ఖాతాదారులవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. ఎదురు చూచిన సత్ఫలితాలు దక్కవు.




పాదాలకు సంబంధించిన బాధలతో పాటు మర్మావయవ బాధలుంటాయి. సాధారణంగా గడచిపోతుంది. ఆర్థికవిషయాలు చక్కగా ఉన్నాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. తండ్రి తండ్రి వంటివారికి ఇబ్బందులుండవచ్చు. లైంగికావయవాలు బాధించవచ్చు. గృహాలంకరణవిషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. ప్రతి పనిలో దూకుడు అధికం.

# వారఫలాలు

తేది 17-07-2010 నుండి 23-07-2010 వరకు కర్కాటకంలో రవి, బుధులు; సింహంలో శుక్రుడు; సింహ, కన్యలలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సుల్లో చంద్రుడు సంచరిస్తారు.

## పంచాంగం

17 తేదీ దక్షిణాయనం ప్రారంభం.

21 తేది తొలి ఏకాదశి.

**శుభ ముహూర్తాలు లేవు.**

**జూలై తిథులు**
**ఆషాఢ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 17 | శని | షష్ఠి | ఉ.6.24 | గం.ల.వ |
| | | సప్తమి | తె.4.19 | గం.ల.వ |
| 18 | ఆది | అష్టమి | రా.2.47 | గం.ల.వ |
| 19 | సోమ | నవమి | రా.1.48 | గం.ల.వ |
| 20 | మంగళ | దశమి | రా.1.25 | గం.ల.వ |
| 21 | బుధ | ఏకాదశి | రా.1.35 | గం.ల.వ |
| 22 | గురు | ద్వాదశి | రా.2.17 | గం.ల.వ |
| 23 | శుక్ర | త్రయోదశి | ఉ.3.27 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




అనవసరంగా బాధాదాయకమైన ఊహలకు గురి కావద్దు. మార్పులు, చేర్పులు, కూర్పులు జరుగవచ్చు. పైవారితో అభిప్రాయభేదాలున్నా బయటపడనీయవద్దు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. ఓపిక అవసరం. వివాహాది శుభకార్యప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు ఓ మోస్తరుగా సాగుతుంది.




ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. మూర్ఖపు పట్టుదలలు పనికి రావు. ఒకటికి రెండుమారులు ఆలోచించి చేయడం మంచిది లేదా ఆప్తుల సలహాలు వినడం మంచిది. ధనవిషయాలలో లోటు లేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. మాట నిలబెట్టుకోవడానికి శ్రమపడతారు.




చిన్న చిన్న సమస్యలు పెద్దవి అవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. నోటికి కడుపుకు సంబంధించిన అనారోగ్య బాధలుంటాయి. ఆదాయానికి తగ్గ ఖర్చు ఉంటుంది. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయమందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. కళాకారుల ప్రతిష్ఠ పెరుగుతుంది.




గడచినకాలం కన్నా మేలైన కాలం. విరోధులు తగ్గుముఖం పడతారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటుంది. ఇన్నినాళ్ళు ఆటంకాలతో అడ్డుపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. భూ భవనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి.




పొరసంబంధాలు చక్కగా వుండవు. సంబంధం లేని విషయాల్లో తలదూర్చవద్దు. ఆరోగ్యవిషయంలో పెద్దగా చెప్పుకోతగ్గవేమీ లేదు. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు ఒక మోస్తరుగా చదువు సాగుతుంది. కళాకారులకు ఆశాభంగం.




ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. ఆప్తుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాముల వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటి వారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి. పైవారిని విమర్శించకుండాలి.

# గృహకల్లోల నివారణ, పరిష్కారం సుదర్శన యంత్రం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఐ.పరంధామయ్య ఆత్మకూరు*

* *సమస్యలన్నీ శత్రువులై దాడి చేస్తున్నాయి. బయటపడే సలహా ఏదైనా ఇవ్వగలరా?*

ఆర్థిక, ఆరోగ్య, కుటుంబ సమస్యలు ఉక్కిరి బిక్కిరి చేస్తున్నప్పుడు వాస్తులోపాలను సవరించుకోవాలి. ఈలోగా 'సుదర్శన యంత్రం' తెరిపిని, మనశ్శాంతిని ఇస్తుంది.

*ఎమ్.రమణారెడ్డి ఆత్మకూరు*

* *ముప్పై సంవత్సరాల బంగరు జీవితం విచ్ఛిన్నమయి పోయింది.*

వాస్తు సరిచేసుకోవాలన్న మీ ఆవిడ అభిప్రాయాన్ని గౌరవించి వుంటే మీకీ పరిస్థితి వచ్చి వుండేది కాదు. 'శుక్ర మహర్దశ' గడిచాక ఒడలు సైతం బండ్లవుతాయి.

*వై.ఇందుమతి శ్రీకాళహస్తి*

* *వచ్చిన వాళ్లంతా ఇల్లు బాగానే వుందంటారు. పైగా ఏ సమస్యలు కూడా లేవు.*

జ్యోతిశాస్త్ర గ్రహాలు అనుకూలంగా వున్నపుడు మీకలాగే అనిపిస్తుంది. తర్వాత ఆకస్మికంగా దెబ్బ మీద దెబ్బ పడుతుంది. వాస్తు విషయంలో అజాగ్రత్త తగదు.

*సరస్వతి అమ్మాళ్ నెల్లూరు*

* *వాడి ఉద్యోగ కష్టం గుండె తరుక్కుపోతా వుంది.*

పశ్చిమ దిశా దోషాలున్నప్పుడు ప్రశాంతంగా వున్నవాళ్లు కూడా పిచ్చివాళ్లలా ప్రవర్తిస్తారు. ఉద్యోగం మీద శ్రద్ధకాదు. ఇంట్లో ఉండలేని పరిస్థితి. సుదర్శన యంత్ర ప్రతిష్ఠ చాలా మేలు చేస్తుంది.

*కె.వి.పరశురాం వెంకటాచలం*

* *ఇల్లు అమ్మి పట్టణం వెళ్లాలని అందరూ నిశ్చయించుకొన్నారు.*

బాడుగకో, బంధువులకో గృహాన్ని ఇచ్చే ముందు ఆగ్నేయం సెప్టిక్‌ట్యాంకు తీసివేయండి. మీరు వాస్తుయంత్రాన్ని నిరభ్యంతరంగా పట్టణ గృహంలో ప్రతిష్ఠించవచ్చు.

*ఎన్.విల్సన్ కళ్యాణ్ నెల్లూరు*

* *నేను వాస్తును, భారతీయ సాంప్రదాయాలను గౌరవిస్తాను.*

మనం ముందు భారతీయులం, తర్వాతే మతాల ప్రస్తావన. వాస్తు, జ్యోతిష్యం వంటి శాస్త్రాలు భారతీయులవి, మతాలవి కాదు. పాటింపు వల్లే మీరింత సంతోషంగా ఉండగలుగుతున్నారు.

*కె.విక్టర్ సుధాకర్‌రావు బెంగుళూరు*

* *చర్చి నిర్మాణం చేయాలనుకున్న స్థలం సమీపంలో ఆలయం కూడా వుంది?*

భగవంతుడు ఒకడే. మనం వివిధ రూపాలతో చూస్తున్నాం. నిర్భయంగా నిర్మాణం చేయండి. వాస్తు సిద్ధాంతికి చూపించాలన్న మీ అభిప్రాయం మంచిదే. అయితే తొలుత మీ మత గురువులకు కూడా చూపించండి.

*పి.విశాలక్ష్మమ్మ ఆత్మకూరు*

* *జ్యోతిష్యంలో, వాస్తులో కొన్ని విషయాలను చెప్పరు ఎందుచేత?*

నక్షత్ర గణన, గృహదోషాలను బేరీజు వేసినపుడు అనారోగ్యం, మృత్యువు, శనిస్థానం, ప్రమాదం, రాహుస్థితి అంగవైకల్యం లాంటి విషయాలు వచ్చినపుడు. నరఘోష యంత్ర ప్రతిష్ఠకు సిఫార్సు చేయడం జరుగుతుంది. వాస్తవాలు వారి మనస్త్వాలను దెబ్బతీస్తాయి గనుక నియమపరులైన వారు చెప్పరు.

*పి.సుదర్శనరావు ఉదయగిరి*

* *మాస ఫలితాల్ని చూస్తూ కూర్చుంటే ఇల్లు కట్టేదెట్లా?*

జ్యేష్ఠ, భాద్రపదం, మార్గశిరం, పుష్యం లాంటి వివాద మాసాల్లో స్థల శుద్ధి, ప్రణాళికారూపు, వస్తు సామాగ్రి సేకరణ, వాస్తు చూపించుకోవడం చేయవచ్చు. అయితే శంకుస్థాపన జరిగిపోయాక ఈ మాసాల్లో నిర్మాణాలు చేసేవారు 'నరఘోష' యంత్ర ప్రతిష్ఠ చేసుకొని కొనసాగింపవచ్చు.

*పి.మార్కండేయులు బెంగుళూరు*

* *'మఖ' 4వ పాదం. నేను గృహ నిర్మాణం చేయకూడదంటున్నారు.*

మీ నక్షత్రం సింహరాశికి చెందింది. గణం రాక్షసం, జంతువు ఎలుక వస్తుంది. అయితే 'సుదర్శన' యంత్ర ప్రతిష్ఠ చేసుకొని మీరు నిరభ్యంతరంగా గృహ నిర్మాణం చేయవచ్చు.

# వెనుకబడిన వాకాడు గ్రామ పంచాయితీ!

మండల కేంద్రంగా వున్న వాకాడు గ్రామ పంచాయితీ అభివృద్ధి పనుల విషయంలో చాలా వెనుకబడి వుంది. గ్రామ పంచాయితీ పాలకవర్గం పంచాయితీలోని ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించడంలో ఏమాత్రం దృష్టి సారించడం లేదు. పంచాయితీలో మొత్తం పెత్తనాన్ని కాంగ్రెస్ పార్టీకి చెందిన కొందరు నేతలు చెలాయిస్తున్నారు. పంచాయితీలో వసూలు కావాల్సిన పన్నులు సిబ్బంది కొరత కారణంగా సక్రమంగా వసూళ్లు కావడం లేదు. దీంతో నిధుల కొరత ఏర్పడి పనులు చేపట్టలేకపోతున్నారు.

వాకాడు గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా కాంగ్రెస్ పార్టీకి చెందిన శ్రీనివాసులు ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. ఎస్టీ రిజర్వేషన్ కేటగిరి క్రింద ఎన్నికైనప్పటికి అధికార పార్టీకి చెందిన నాయకులకు రబ్బర్‌స్టాంప్‌గా మారిపోయారు. గ్రామ పంచాయితీలో ప్రతి సమస్య గురించి సర్పంచ్‌కు కనీసం అవగాహన వుంటుంది. అయితే ఈ గ్రామ పంచాయితీ సర్పంచ్‌కు ఏ ఒక్క విషయంపై కూడా అవగాహన లేకపోవడం విశేషం. సర్పంచ్‌గా ఎన్నికై దాదాపు నాలుగున్నర సంవత్సరాలు కావస్తున్నా కూడా పన్నుల బకాయిలు వసూళ్లు చేసుకోలేకపోతున్నాడు.

ఈ గ్రామ పంచాయితీలో 3వేల కుటుంబాలు, 8వేల జనాభా, 5వేల మంది ఓటర్లు వున్నారు. దీని పరిధిలో ఎస్సీ, ఎస్టీ, బిసి కాలనీలు వున్నాయి. గ్రామ పంచాయితీలో ప్రధానంగా డ్రైనేజీ కాల్వల సమస్య, అంతర్గత రోడ్ల సమస్యలు వున్నాయి. వీధులలో వేసిన చెత్తా, చెదారాన్ని ప్రతిరోజు తొలగించి వీధులను శుభ్రం చేసేందుకు అవసరమైన సిబ్బంది లేకపోవడంతో వీధులలో చెత్త పేరుకుపోతున్నది. డ్రైనేజీ కాల్వల ద్వారా మురికినీరు వెళ్లేందుకు అవకాశం లేకపోవడంతో రోడ్లపై చేరి భరించరాని వాసన వస్తుంది.

త్రాగునీటి సరఫరా కొంతమేర బాగానే వుందని స్థానికులు చెప్పారు. గ్రామ పంచాయితీలో ఎదుర్కొంటున్న ఇతర సమస్యలపై నోరు విప్పేందుకు స్థానికులు భయపడుతున్నారు. వీరు మాట్లాడేందుకే భయపడుతున్నారంటే ఇక్కడ రాజకీయాలు ఎలా వుంటాయో అర్థం చేసుకోవచ్చు. పంచాయితీలో సమస్య గురించి మాట్లాడితే ఇక్కడ నాయకులు వివిధ రకాలుగా వేధింపులకు గురిచేస్తుంటారని వ్యాఖ్యానించారు. 12వ ఆర్థిక సంఘం, ఎస్.ఎఫ్.సి నిధులు ఎన్ని వస్తున్నాయి? వాటిని ఏ పనులకు ఖర్చు చేస్తున్నారన్న సమాచారాన్ని సైతం వెల్లడించేందుకు సిబ్బంది వెనుకంజ వేస్తున్నారు.

ఇంటి పన్నులు రెండున్నర లక్షల రూపాయలు వసూలు కావాల్సి వుండగా వీటిలో 30 శాతం కూడా వసూలు చేసే దిక్కు లేకుండా పోయారు. వీధిలైట్లు వెలగకపోయినా, బల్బులు కాలిపోయినా ఎవరు పట్టించుకోరు. ఇందిరమ్మ పథకం ద్వారా 3వ విడతలో ఈ గ్రామ పంచాయితీకి 650 గృహాలు మంజూరయ్యాయి. వీటిలో ఇప్పటి వరకు సగభాగం కూడా పూర్తికాక అధికారుల వైఖరిని వెక్కిరిస్తున్నాయి. జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం ద్వారా ఇరవై లక్షల రూపాయల పనులు చేపట్టేందుకు ప్రతిపాదనలు పంపారు. ఈ నిధులు మంజూరైతే కాల్వలు పూడికతీత, లెవలింగ్ పనులు చేపట్టే అవకాశం వుంది.

గ్రామ పంచాయితీలో ప్రజలు తాము ఎదుర్కొంటున్న సమస్యలను విన్నవించుకునేందుకు అటు కార్యదర్శి, సర్పంచ్‌లు అందుబాటులో వుండడం లేదు. వృద్ధాప్య, ఇతర పెన్షన్లు పంపిణీ చేసే సమయంలో మాత్రం కార్యదర్శి అందుబాటులో వుంటాడని, మిగిలిన రోజుల్లో ఇద్దరు కనిపించరని స్థానికులు వాపోయారు.



గ్రామ పంచాయితీ కార్యాలయం.



డ్రైనేజి కాల్వపైనే మంచినీటి కొళాయి.

అవినీతి కథ

# సాక్షరభారతి కోఆర్డినేటర్ల ఎంపికలో అవకతవకలు!

జిల్లాలో సాక్షర భారతి కార్యక్రమం అమలు తీరుపై సర్వత్రా విమర్శలు వినిపిస్తున్నాయి. ఈ కార్యక్రమాన్ని పటిష్టంగా అమలు చేయాలని ఒక ప్రక్క ప్రభుత్వం భావిస్తుండగా మరోప్రక్క అధికారులు నిబంధనలు పాటించకపోగా అవకతవకలకు పాల్పడుతున్నారు. ఈ కార్యక్రమం అమలులోకి రాక ముందే అవకతవకలు జరుగుతుంటే అమల్లోకి వచ్చిన తర్వాత ఏ విధంగా వుంటుందోనన్న సందేహాలు వ్యక్తమవుతున్నాయి.

సాక్షర భారతి కార్యక్రమం అమలుకోసం జిల్లా, మండలం, గ్రామపంచాయితీ స్థాయిలో కో-ఆర్డినేటర్ల నియామకం జరుపుతున్నారు. ఈ ఎంపికలలో కూడా రాజకీయాలకే అధిక ప్రాధాన్యత సంతరించుకుంటుంది. కో-ఆర్డినేటర్ల ఎంపికల్లో స్థానికసంస్థలకు పూర్తి అధికారం కల్పించింది ప్రభుత్వం. జిల్లాస్థాయిలో జిల్లా పరిషత్, మండలస్థాయిలో మండల పరిషత్, గ్రామస్థాయిలో పంచాయితీ సర్పంచ్ ఆధ్వర్యంలో ఎంపికలు జరుగుతున్నాయి. కో-ఆర్డినేటర్ల ఎంపికలలో ఉన్నత విద్య చదివినవారినే ఎంపిక చేసుకోవాల్సి వుంటుంది. అయితే రాజకీయ ప్రమేయం కారణంగా వున్నత చదువులు చదివిన వారికి తీరని అన్యాయం జరుగుతుంది.

కో-ఆర్డినేటర్ల ఎంపికలో అవకతవకలు జరిగాయన్న దానికి ఉదాహరణగా అల్లూరు మండల పరిషత్‌ను పేర్కొనవచ్చు. మండల కో-ఆర్డినేటర్ల పోస్టుకు దాదాపు 25మంది దరఖాస్తు చేసుకోవడం జరిగింది. దరఖాస్తు చేసుకున్న వారికి ఈ నెల 10వ తేదిన అల్లూరు మండల పరిషత్ కార్యాలయంలో ఇంటర్వ్యూలు నిర్వహించారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం మండలపరిషత్ అధ్యక్షులు, ఎంపిడిఓ, మండల విద్యాశాఖధికారి కమిటీగా వున్నారు. కో-ఆర్డినేటర్ పోస్టుకు వచ్చిన దరఖాస్తులను పరిశీలించి ఎక్కువ విద్యార్హతలు కలిగిన వ్యక్తిని ఎంపిక చేయాల్సి వుంటుంది. అయితే ఇక్కడ రాజకీయం ప్రవేశించడంతో తక్కువ విద్యార్హత కలిగిన వ్యక్తిని ఎంపిక చేశారు.

అల్లూరు మండల పరిషత్ అధ్యక్షురాలు తెలుగుదేశం పార్టీకి చెందినవారు. స్థానిక ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు కూడా టిడిపికి చెందినవారు కావడం వలన వీరిద్దరి సూచన మేరకు ఇస్కపల్లికి చెందిన పెంచలయ్య మండల కో-ఆర్డినేటర్‌గా ఎంపికయ్యారు. దరఖాస్తు చేసుకున్నవారిలో అల్లూరుకు చెందిన సుబ్రహ్మణ్యం శర్మ అనే వ్యక్తి ఎంఎస్సీ, బిఇడి చేసి వున్నారు. ఇతని కంటే ఎక్కువ విద్యార్హతలు కలిగినవారు దరఖాస్తు చేసిన వారిలో ఎవరు లేరు. ఇతనికి ఎటువంటి రాజకీయ సిఫార్సు లేకపోవడం వలన ఎంపిక కాలేకపోయారు.

ప్రతిభను ఆధారంగా చేసుకొని ఎంపిక చేయాలని ప్రభుత్వ నిబంధనలు చెబుతున్నప్పటికి అల్లూరులో వీటి గురించి పట్టించుకునే వారు లేకుండా పోయారు. నెలరోజుల క్రితం మండల కో-ఆర్డినేటర్ పోస్టుకు ఎంపిక జరిగిపోయిందనాలి. కాకపోతే ఇంటర్వ్యూలు నిర్వహించాల్సి వుంటుంది. కాబట్టి తూతూమంత్రంగా నిర్వహించినట్లు దరఖాస్తు చేసుకున్న అభ్యర్థులు చెబుతున్నారు. స్థానిక ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు స్వగ్రామం ఇస్కపల్లికి చెందిన పెంచలయ్యకు ఈ పోస్టు ఇప్పించుకోగలిగారు. మండల కమిటీలో దీనిపై అభ్యంతరం చెప్పేవారు కరువయ్యారు.



జిల్లా సాక్షరతా సమితి కార్యాలయం (ఫైల్‌ఫోటో).

ఎంఎస్సీ, బిఇడి చదివిన అభ్యర్థిని కాదని కేవలం బిఏ బిఇడి చేసిన వ్యక్తిని ఎంపిక చేసుకోవడంపై విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. ఇదేవిధంగా జిల్లాలోని అన్ని మండలాల్లో తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలకు చెందిన నేతలు, ప్రజాప్రతినిధులు సూచించిన వ్యక్తులనే కో-ఆర్డినేటర్లగా ఎంపిక చేయడం జరిగింది. గ్రామపంచాయితీలలో కూడా పై విధంగానే జరిగింది. సాక్షరభారతి కార్యక్రమంలో ఇలా అవినీతి, అక్రమాలు జరగడంపై జిల్లా కలెక్టర్ విచారణ జరిపించాలని అభ్యర్థులు కోరుతున్నారు.

## హోదాతో ఇబ్బందులు!



సినీ పరిశ్రమలో అగ్ర కథానాయిక హోదా గొప్పదే కావచ్చు. అది ఏ క్షణానికి ఎవరికి దక్కుతుందో చెప్పలేమంటుంది బాలీవుడ్ హీరోయిన్ కరీనాకపూర్. అగ్ర కథానాయిక హోదా ఒక పక్క గౌరవం మరో ప్రక్క వుంటే భయం. ఎందుకంటే బాధ్యతలు పెరుగు తాయి. అయినా నేను పోషించే పాత్రల ద్వారా, నా ప్రవర్తనను బట్టి నాకా పవర్, హోదా వస్తుంది. ఈ పవర్ లిస్ట్‌లో వున్నామా? లేదా? అనేదానికంటే నటనకు స్వస్తి చెప్పిన తర్వాత జ్ఞాపకాలుగా మిగిలిపోయే మంచి సినిమాలు చేయడం అవసరమంటుంది.

## ఒక్క హిట్ చాలు!



గత ఏడేళ్లుగా వరుస విజయాలతో ముందుకెళ్తోంది హీరోయిన్ కత్రినాకైఫ్. ప్రస్తుతం 'రాజ్‌నీతి' చిత్రంలో విమర్శకుల ప్రశంసలు పొందే ప్రతిభ కనబరిచింది. అందులో ప్రేమికురాలిగా, రాజకీయవేత్తగా కత్రీనా నటన అందరినీ ఆకట్టుకొంటోంది. ఆమె కోరుకున్నట్లుగా యాష్‌చోప్రా దర్శకత్వంలో ఓ చిత్రంలో నటించే అవకాశం దక్కింది. గతంలో హేమమాలిని చేసిన 'సీతా అవుర్ గీతా' లాంటి చిత్రాలను చేయాలని వుంది. అదేవిధంగా లేడీ ఓరియెంటెడ్ సినిమాలు చేయాలని ఎన్నాళ్ల నుంచో మనసులో అనుకొంటున్నట్లు కత్రినా చెప్పుకొచ్చింది. ఒక సినిమా చూస్తున్నప్పుడు అపజయం పాలవుతుందని భయపడతారు. ప్రతి పనిలో జయం, అపజయం రెండూ వుంటాయి. అయితే విజయం వచ్చినప్పుడు సంబరపడి, అపజయం వస్తే డీలా పడితే కుదరదు. జీవితంలో ఎక్కువ శాతం కష్టాలే వస్తాయి. కానీ ఒక్క విజయం సాధిస్తే చాలు. అన్ని బాధలు మర్చిపోతామంది.

## ట్విట్టర్లతో తిప్పలు



ఈమెయిల్, ట్విట్టర్‌ల ద్వారా ఎప్పటికప్పుడు తారల తాజా సమాచారం తెలుసుకొనే వీలు అభిమానులకు చిక్కింది. అయితే ఈ ఐడీలను హైజాక్ చేసే సైబర్ నేరగాళ్ల బెడద కూడా ఎక్కువైంది. ఈ మధ్య త్రిష పేరు మీద ఖాతా తెరిచి అందరికీ ఈమెయిల్ సందేశాలు పంపాడు ఓ అగంతకుడు. ఇప్పుడీ జాబితాలో హీరోయిన్ మేఘనా నాయుడు చేరింది. ఇటీవల ఆమె మెయిల్ ఐడీని హైజాక్ చేసిన అగంతకుడు మేఘనే స్వయంగా పంపినట్లు నాకు గర్భం వచ్చింది... అబార్షన్ చేయించుకోవాలని వుందని స్నేహితురాళ్లకు సందేశం పంపాడు. స్నేహితుల ఫోన్లతో ఉక్కిరిబిక్కిరైన మేఘన ఢిల్లీ పోలీసులను ఆశ్రయించింది. ఇది చిన్న విషయం కాదు. మానసికంగా బాగా కృంగిపోయానని లబోదిబోమంది.

## ప్రేమంటే తెలిసింది!



సింహా చిత్రం విజయంతో నమితలో కొత్త ఉత్సాహం వెల్లివిరుస్తుంది. ఇటీవల ఆమె తన ట్విట్టర్‌లో అభిమానులపై ఓ చిలిపి ప్రశ్న సంధించింది. నేను ఈ రోజు చాలా రొమాంటిక్‌గా వున్నాను. అలాంటి ఆలోచనలే వస్తున్నాయి. అది మీతో పంచుకోవాలనుకొంటున్నాను. ప్రేమంటే ఏమిటి? మీకు తోచిన నిర్వచనం చెప్పమని అడిగింది. ఇంకేముంది... అభిమానుల నుంచి నిర్వచనాల పరంపర మొదలయ్యింది. వీటిలో కొన్ని సరదాగా వుంటే మరికొన్ని చిలిపిగా అనిపించాయి. చాలావరకు గిలిగింతలు పెట్టేవే. మొత్తానికి వీటి వల్ల ప్రేమ గుర్చి బాగా తెలిసొచ్చిందంటుంది నమిత. నమ్ముదామా?

## అందమైన పువ్వులా చూపారు!



ఝుమ్మందినాదం చిత్రంతో తనకు బాగా గుర్తింపు వచ్చినందుకు హీరోయిన్ తాప్సీ తెగ ఆనందపడిపోతుంది. నిజంగా ఎంతో అదృష్టం చేసుకుంటే తప్ప తొలి సినిమాలోనే ఇలాంటి ఛాన్స్ దక్కదు. ఝుమ్మంది నాదంలో రాఘవేంద్రరావు గారు నన్ను ఓ అందమైన పువ్వులా చూపించారు. కొబ్బరి చిప్పలో కూర్చోబెట్టారు. నాపై ఎన్ని ద్రాక్ష, యాపిల్, మామిడి పళ్లు విసిరారో లెక్కపెట్టుకోవాలంటే సినిమాకు వెళ్లాల్సిందే. వైవిధ్యమైన నటీమణిగా పేరు తెచ్చుకోవాలన్నదే నా ఆశ. ఇకపై నా దృష్టంతా నటనవైపేనన్నది ఈ చిన్నది.

# భీమిలి కబడ్డీ జట్టు బాగుంది!



అల్లూరు రహీం

జనాభిమానం పొందిన 'ఆట' నేపథ్యంగా తెలుగులో తీసిన సినిమాలు తక్కువేననాలి. అదే హిందీలో అయితే క్రికెట్, హాకీ ఆటలు కథావస్తువుగా తీసిన లగాన్, చక్‌దే ఇండియా చిత్రాలు అద్భుత విజయాలు సాధించాయి. ఈమధ్య తెలుగులో సై, కబడ్డీ సినిమాలు వచ్చినా అవి అంతగా జనాదరణ పొందలేదు. తాజాగా మెగా సూపర్ గుడ్ ఫిలిమ్స్ పతాకంపై నిర్మాతలు ఎన్వీ ప్రసాద్, పరాస్‌జైన్‌లు నూతన దర్శకుడు తాతినేని సత్య చేత తీయించిన భీమిలి కబడ్డీ జట్టు సినిమా మాత్రం రొటీన్‌కు భిన్నంగా వుంది. ఈ సినిమాలో కబడ్డీ ఆట, అందమైన ప్రేమకథ, గుండెలు పిండే విషాదం వుంది. ఈ మూడు అంశాలను ఏ మాత్రం విసుగనిపించకుండా దర్శకుడు అద్భుతంగా తెరకెక్కించాడు. ఈ సినిమాకు ఆధారమైన తమిళచిత్రం 'వేనీలా కబడ్డీ కుళు' స్క్రీన్‌ప్లేకు తెలుగుతనం అద్దిన తీరు పొందికగా కుదిరింది. హీరో దురదృష్టాన్ని సింబాలిక్‌గా చెప్పను చిన్నతనంలోనే అతని తండ్రి చనిపోవడం, కుటుంబ పోషణ నిమిత్తం అతను భూస్వామి వద్ద గొర్రెలు కాయను కుదరడం ప్రేక్షకుల మనసులు పిండేస్తుంది. ఈ సన్నివేశాన్ని తలదన్నేదే పతాక సన్నివేశంలో హీరో తనకు ప్రాణప్రదమైన కబడ్డీ ఆటలో భీమిలి జట్టును గెలిపించను ప్రాణాలు కోల్పోవడం ఇటువంటి సన్నివేశం తెలుగు సినిమాల్లో అసలు కుదరదు. రాజమండ్రి నుంచి భీమిలికి జాతర చూడను వచ్చిన హీరోయిన్ హీరోను చూసి ఇష్టపడే సన్నివేశాలు మనసు మరులుగొల్పుతాయి. గ్రామాల్లోని ప్రేమికులు బస్టాండుల్లో బస్సుల కోసం నిలబడి ఓర చూపులు చూసుకొనే సన్నివేశాలు గ్రామీణ ప్రేమికుల హృదయాలను తట్టిలేపుతాయి. కబడ్డీ ఆట కోసం భీమిలి యువకులు పడే పాట్లు, తగవులు పొందికగా కుదిరాయి. సెల్వగణేష్ సంగీతానికి, వనమాలి సాహిత్యానికి లంకె కుదరబట్టే ఉరికే అల్లరి, పద పద తరిమి చరణాలతో సాగే పాటలు వినసొంపుగా వున్నాయి. జాతరలో సాగే హేహోలాహోలా పాటలో గ్రామాల్లో విద్యుత్ కోత ప్రస్తావన బాగా కుదిరింది. జీవితమంటే ఆశ, గెలుపు మరో గెలుపు తెస్తుందన్న చైతన్య మాటలు ఆలోచింపజేస్తాయి.

చిత్రకథలోనికి వెళ్తే సూరి (నాని)ది భీమిలి. కడు బీద కుటుంబీకుడు. చిన్నప్పటి నుంచి కబడ్డీ ఆట అంటే ఎంతో ఇష్టం. గ్రామంలోని వివిధ కుటుంబీకుల పిల్లలు కబడ్డీ ఆడుతూ ఎప్పుడోకప్పుడు అతనికి ఎక్స్‌ట్రా ప్లేయర్‌గా ఛాన్స్ యిస్తుంటారు. తండ్రి చనిపోవడంతో భూస్వామి వద్ద పనికి కుదురుతాడు సూరి. గొర్రెలు మేపుతూనే గ్రామ జట్టు సభ్యులతో కలిసి కబడ్డీ ఆడుతుంటాడు. గ్రామ దేవత జాతరకు రాజమండ్రి నుండి వచ్చే యువతికి (శరణ్యామోహన్) (సినిమాలో హీరోయిన్‌కు పేరు లేదు) తాను వచ్చే బస్సుతో పాటు సైకిల్ తొక్కడంలో పోటీపడే సూరి ఎంతగానో నచ్చుతాడు. జాతర సందర్భంగా భీమిలిజట్టు ఉప్పాడ జట్టుతో కబడ్డీ ఆడుతుంది. కాని ఆట చివరలో గొడవ జరిగి ఫలితం ప్రకటించరు. వుట్టి కొట్టే సమయంలోనూ హీరోయిన్, హీరోను ప్రోత్సహిస్తుంది. మనుషులు తక్కువగా వుండే భీమిలి గ్రామవీధుల్లో హీరో, హీరోయిన్లు తెగ తిరిగేస్తారు. కాని ఆమె గ్రామం నుంచి వెళ్లిపోయే వరకు అతను పేరు అడగడు. ఆమె చెప్పలేదు. మళ్లీ వచ్చేయేడు జాతరలో కలుద్దామని బాసచేసి వెళ్లిపోతుంది. రాజమండ్రిలో జరిగే రాష్ట్రస్థాయి కబడ్డీ పోటీల్లో పాల్గొనను వెళ్లిన భీమిలి జట్టుకు కబడ్డీ కోచ్ ప్రకాష్(కిరణ్) బాగా సహాయం చేస్తాడు. దీంతో లీగ్ దశలు దాటుకొని ఫైనల్ దశకు వచ్చిన భీమిలి జట్టుపై ఆఖరి పాయింట్ కూతకు వచ్చే హైదరాబాద్ ఆటగాడు ఎగిసి సూరి గుండెపై కొట్టడంతో అతన్ని ఒడిసి పట్టుకొనే ప్రాణాలు వదిలేసి తన జట్టును గెలిపిస్తాడు. గ్రామంలో హీరోగా వెలుగొందుతాడు. మరుసటి సంవత్సరం జాతరకు వచ్చిన హీరోయిన్, నాని కోసం కళ్లు కాయలు కాచేలా వెదుకుతుంది. అతను చనిపోయిన విషయం ఆమెకు తెలియదు. అతని స్మృతుల్లోనే రాజమండ్రి బస్సు ఎక్కడంతో సినిమా ముగుస్తుంది.




అష్టా-చమ్మా, రైడ్ చిత్రాల్లోనూ ప్రతిభావంతంగా నటించిన నానికి భీమిలి కబడ్డీ జట్టు చిత్రం మరింత పేరు తెస్తుంది. హీరోయిన్ శరణ్యామోహన్ నటన కూడా బాగుంది. కబడ్డీ కోచ్‌గా కిషోర్ బాగా నటించాడు. కబడ్డీ జట్టు సభ్యులుగా పలువురు యువనటుల నటన బాగుంది. ఈ సినిమాను ప్రతిభావంతంగా మలిచిన క్రెడిట్ అంతా దర్శకుడు తాతినేని సత్యదేననాలి.



# విద్యార్థుల్లో ఉత్తేజం!



జడ్పీ స్కూల్‌లో టెన్త్ చదివి అత్యధిక మార్కులు తెచ్చుకొన్న కోవూరు బాలిక తులసి వెంకట హరితకు బహుమతినందిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, కలెక్టర్ రాంగోపాల్, ఎమ్మెల్సీ బాలసుబ్రహ్మణ్యం.

ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులను వెన్నుతట్టి ప్రోత్సహించేందుకు వారిలో దాగివున్న ప్రతిభను వెలికితీసేందుకు జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి నగదు పురస్కారాలను అందజేస్తున్న సంగతి తెలిసిందే. ఛైర్మన్‌గా బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి జిల్లా పరిషత్ పాఠశాలల్లో పదవ తరగతిలో అత్యధిక మార్కులు సాధించిన మొదటి ముగ్గురు విద్యార్థులకు లక్ష, 75వేలు, 50వేలు రూపాయలను గత నాలుగేళ్లుగా అందిస్తున్నారు. రాష్ట్రంలో ఎక్కడాలేని విధంగా, ఏ ఛైర్మన్ చేపట్టనివిధంగా సొంత నిధులతో ఇలాంటి కార్యక్రమాలు నిర్వహిస్తూ అందరికీ ఆదర్శంగా నిలుస్తున్నారు.

ఈ ఏడాది ఈ ప్రతిభ పురస్కారాల కార్యక్రమం ఉత్తేజిత పేరిట పిచ్చిరెడ్డి కళ్యాణ మండపంలో జూలై 9న విద్యార్థులు, అధికారులు, తల్లితండ్రుల సమక్షంలో ఘనంగా జరిగింది. పదవ తరగతిలో జిల్లా పరిషత్ పాఠశాలల్లో జిల్లాల్లో మొదటి స్థానం సాధించిన కోవూరు జడ్పీ హైస్కూలు విద్యార్థి తులసి వెంకట హరితకు లక్ష రూపాయలు, రెండవ స్థానం సాధించిన కలిగిరి జడ్పీ హైస్కూలు విద్యార్థిని కీర్తిరెడ్డికి 75వేలు, మూడవ స్థానంలో నిలచిన పొదలకూరు జడ్పీ హైస్కూలు విద్యార్థి యుగంధర్‌కు 50వేల రూపాయలు పురస్కారాన్ని అందించారు. మునిసిపల్ పాఠశాలల్లో అత్యధిక మార్కులు పొందిన సుధీర్‌కు ప్రోత్సాహకంగా 50వేలను ఇచ్చారు. 500పైగా మార్కులు సాధించిన 524 మంది విద్యార్థులకు రిస్టు వాచీలు, జ్ఞాపికలను అందజేశారు. పిల్లలతో పాటు 100 శాతం ఉత్తీర్ణత సాధించిన స్కూలు ఉపాధ్యాయులను ఈ కార్యక్రమంలో సన్మానించడం విశేషం.

తాను పదవిలో లేకపోయినా ఈ ప్రతిభ పురస్కారాల కార్యక్రమాన్ని మాత్రం కొనసాగిస్తానని జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి స్పష్టం చేశారు. ఇకపై ఎస్సీ, ఎస్టీ, బిసి హాస్టళ్లలో చదివే విద్యార్థులకు తన తల్లి కాకాణి లక్ష్మీకాంతమ్మ పేరు మీద నగదు పురస్కారాలను ప్రదానం చేస్తానని ప్రకటించారు. విద్యార్థులకు ఎంతో ప్రయోజనం కలిగించే కార్యక్రమాన్ని సొంత నిధులతో నిర్వహిస్తున్న గోవర్ధన్‌రెడ్డి అభినందనీయుడని కలెక్టర్ రాంగోపాల్ వ్యాఖ్యానించారు. శాసనమండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ తాను మండలిలో జరిగే సమావేశాలకు రెండుసార్లు మాత్రమే గైర్హాజరయ్యానని కారణం ఈ కార్యక్రమానికి హాజరు కావడమేనన్నారు. జిల్లా పరిషత్ సిఇఓ రామిరెడ్డి అధ్యక్షత వహించిన ఈ కార్యక్రమంలో అదనపు జెసి సీతారామయ్య, డిఆర్‌ఓ జయరామయ్య, డిఇఓ బాలకాశయ్య తదితరులు పాల్గొన్నారు.



నార్తుమోపూరు భూస్వామ్య కుటుంబీకుడు కాకాణి పాండురంగారెడ్డి మనుమడు అభినయ్‌రెడ్డి, శాంభవిల వివాహం జూన్ 2వ తేది మాదాపూర్‌లోని హైటెక్స్‌లో జరిగింది.

# భద్రత కరువైన రైళ్లు

రైళ్లలో ఇటీవల చోటుచేసుకుంటున్న వరుస దొంగతనాలు ప్రయాణీకులను భయభ్రాంతులకు గురి చేస్తున్నాయి. దోపిడీ, దొంగతనం జరిగిన తర్వాత తిరిగ్గా రావడం తప్ప రైల్వే పోలీసులు భద్రతకు పటిష్టమైన చర్యలు చేపట్టక పోవడంతో రైలు ప్రయాణీకులు భద్రత గాలిలో దీపంగా మారింది. ప్రతి కంపార్టుమెంటులో ఉండాల్సిన రైల్వే పోలీసులు ఎక్కడా కన్పించకుండా పోవడం, సక్రమంగా తనిఖీలు చేపట్టకపోవడం, భద్రత కల్పించలేక పోవడంతో దొంగలకు సులువుగా



రైళ్లలో దొంగతనాలు ఎక్కువైపోయాయి.

తమ పని చక్కబెట్టుకొనేందుకు అవకాశంగా మారింది. దీనికి తోడు తగినసంఖ్యలో పోలీసులు లేకపోవడం ప్రయాణీకుల పాలిట శాపంగా పరిణమించింది. జిఆర్‌పి, సిఆర్‌పిఎఫ్ పోలీసులు రైళ్లలో భద్రతా విధులు నిర్వహిస్తుంటారు. నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు సర్కిల్ పరిధిలోకి వస్తాయి. డిఎస్పీ ఆధ్వర్యంలో ప్రయాణీకుల భద్రత చూస్తుంటారు. రైల్వే పోలీసులకు సంబంధించి ఖాళీయైన పోస్టులను భర్తీ చేయకపోవడంతో సిబ్బంది సమస్య ఎదురౌతుంది. ఐదు సిఐ పోస్టులు, మూడు ఎస్ఐ పోస్టులు, 70 హెడ్‌కానిస్టేబుల్ పోస్టులు మొత్తం 78 పోస్టులు చాలాకాలంగా ఖాళీగా వున్నాయి. వీటి భర్తీ గురించి ప్రభుత్వం పట్టించుకోకపోవడంతో చాలీచాలని సిబ్బందితో తూతూమంత్రంగా విధులు నిర్వహిస్తుండడంతో రైళ్లలో దొంగతనాలు పెరిగేందుకు కారణమైంది.

# పరిష్కారం కాని ప్రజావిజ్ఞప్తులు

పేదల సమస్యల పరిష్కారం కోసం ఏర్పాటుచేసిన గ్రీవెన్స్ సెల్ పనితీరు నామమాత్రమైంది. ప్రతి సోమవారం జిల్లా కలక్టరు కార్యాలయంలో జరిగే ఈ ప్రజావిజ్ఞప్తుల దినానికి జిల్లా



ప్రజావిజ్ఞప్తులు స్వీకరిస్తున్న కలెక్టర్.

నలుమూలల నుంచి పలువురు తమ సమస్యలను అధికారులకు చెప్పుకొనేందుకు విచ్చేస్తుంటారు. సమస్యలపై వచ్చే వారి సంఖ్య వారం వారం అధికమవుతున్నా సమస్యల పరిష్కారం మాత్రం చాలా స్వల్పంగా వుంటుంది. ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసినపుడు అధికారుల్లో వున్న శ్రద్ధ ఇప్పుడు కన్పించడం లేదు. జిల్లా కలెక్టర్‌తోపాటు అన్ని శాఖల అధికారులు గ్రీవెన్స్‌సెల్‌కు విచ్చేసి ప్రజల బాధలు, సమస్యలు విని వాటి పరిష్కారానికి తగిన చర్యలు చేపట్టాల్సి వున్నా ఆ దిశగా అధికారులెవరూ ప్రయత్నించకపోవడంతో అర్జీలు కుప్పలు తెప్పలుగా పేరుకు పోతున్నాయి తప్ప సమస్యలకు పరిష్కారం లభించడం లేదు. ముఖ్యమైన శాఖలకు సంబంధించి వందలాది సమస్యలు పేరుకపోయి వుండడంతో దూర ప్రాంతాల నుంచి వచ్చిన ప్రజలు తమకు న్యాయం జరగడం లేదని వాపోతున్నారు.

# నెల్లూరులో విజయ డయాగ్నొస్టిక్ సెంటర్

జిల్లాకు చెందిన పలువురు పలు రంగాలలో తమదైన శైలిలో రాణిస్తూ జిల్లా పేరు ప్రతిష్టలు ఇనుమడింపజేస్తున్నారు. బుచ్చిరెడ్డిపాళెం మండలం పంచేదు గ్రామానికి చెందిన డాక్టర్ సురేంద్రరెడ్డి డాక్టర్ కోర్సు పూర్తిచేసిన తర్వాత విజయ డయాగ్నొస్టిక్ సెంటర్‌ను నెలకొల్పి వ్యాధి నిర్ధారణలో మంచి సంస్థగా రూపుదిద్దారు. హైదరాబాద్ నగరంలో 15 బ్రాంచీలను ఏర్పాటుచేసిన సురేంద్రరెడ్డి వరంగల్, హన్మకొండ, విజయవాడ, నిజామాబాద్‌లతోపాటు చెన్నై, కలకత్తాల్లోనూ




సండేమార్కెట్ ప్రాంతంలో ఏర్పాటైన విజయ డయాగ్నొస్టిక్స్.

వ్యాధి నిర్ధారణ కేంద్రాలను అత్యాధునికంగా ఏర్పాటు చేశారు. సొంత గడ్డపైనా తమ సంస్థను నెలకొల్పాలన్న ఉద్దేశ్యంతో సండే మార్కెట్ వద్ద విజయ డయాగ్నొస్టిక్ సెంటర్‌ను ఏర్పాటు చేశారు.

సెంటర్ ఏర్పాటుపై సురేంద్రరెడ్డి మాట్లాడుతూ ఒకే చోట అన్ని రోగాలకు కచ్చిత నిర్ధారణ లభించాలన్న ఉద్దేశ్యంతో రేడియాలజీ చేసిన తాను విజయ డయాగ్నొస్టిక్ సెంటర్‌ను నెలకొల్పి 30 సంవత్సరాలుగా విజయ వంతంగా నిర్వహిస్తున్నట్లు చెప్పారు. సామాన్య ప్రజలకు అందుబాటులో వుండే ఫీజులతో నాణ్యమైన రోగ నిర్ధారణ తమ ప్రత్యేకతన్నారు. ఆరు స్లైస్ స్పైరల్ సిటీ స్కానర్, మామోగ్రఫీ, డిజిటల్ ఎక్స్‌రే పరికరాలు అత్యాధునికమైనవి ఏర్పాటు చేశామన్నారు. గుండె, క్యాన్సర్ వ్యాధుల నిర్ధారణకు ఆధునిక పద్ధతులను అవలంభిస్తామన్నారు. 250 రూపాయలతో ప్రివిలేజ్ కార్డును ప్రవేశపెట్టామని, ఈ కార్డు పొందినట్లయితే అన్ని వ్యాధి నిర్ధారణ ఫీజుల్లో 15 శాతం డిస్కౌంట్ ఇస్తామని తెలిపారు.

# చెన్నైలో కేర్ దంత వైద్యశాల




చెన్నై విల్లివాక్కంలోని కేర్ డెంటల్ హాస్పిటల్.

దంత వైద్యరంగంలో పేరుప్రఖ్యాతులు గడించిన పొగతోటలోని కేర్ సూపర్ స్పెషాలిటీ డెంటల్ హాస్పిటల్ తన సేవలను విస్తరించింది. చెన్నై నగరంలో రెండవ బ్రాంచిని ఏర్పాటు చేయడంతో ఇకపై అక్కడి వారికి మెరుగైన దంత వైద్యసేవలు అందనున్నాయి. విల్లివాక్కంలో స్థాపించిన ఈ ఆస్పత్రిని జూలై 4న విజయ హెల్త్ సెంటర్ ఆర్థోపెడిక్ సర్జన్ డాక్టర్ సి.రాజశేఖర్‌రెడ్డి ప్రారంభించారు. హాస్పిటల్ అధినేత డాక్టర్ ఎ.స్వరూప్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ నెల్లూరు, ఆత్మకూరులో హాస్పిటళ్లను ఏర్పాటుచేసి అత్యాధునిక వైద్యాన్ని అందిస్తున్న తాము చెన్నై ప్రజలకు దంత వైద్య సేవలను అందించాలన్న లక్ష్యంతో ఇక్కడ ఏర్పాటు చేశామన్నారు. అన్ని రకాల దంత సమస్యలకు చికిత్స అందిస్తామన్నారు. డాక్టర్ గుబేర్‌నాథ్‌రెడ్డి, డాక్టర్ గిరీష్, డాక్టర్ నీలిమ ఈ హాస్పిటల్‌లో అందుబాటులో వుంటారన్నారు. హాస్పిటల్ ప్రారంభోత్సవ కార్యక్రమంలో డాక్టర్ మోహన్‌రెడ్డి, డాక్టర్ అశోక్, డాక్టర్ విక్టర్ తదితరులు పాల్గొన్నారు.

## అయోమయంలో జగన్

మొదటి పేజీ కొరవ

చేసిన కార్యక్రమాలు వారిలో కృతజ్ఞతాభావాన్ని ప్రేరేపిస్తున్నాయి. అయితే ఇది ఎల్ల కాలం వుంటుందా? 1984లో ఇందిరమ్మ చనిపోతే, 1985 ఎన్నికలలో ఎన్టీఆర్‌కు ఓటు చేశారు ప్రజలు. మార్పు అనేది మానవ సహజం. నాలుగేళ్ల తర్వాత వచ్చే ఎన్నికల వరకు ఈ ఆకర్షణను నిలబెట్టుకోవడానికి జగన్ వద్ద వున్న సాధనా సంపత్తి ఏమిటి? వైఎస్ కుమారుడిని అన్న నినాదం ఒక్కటి తప్ప రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా ఏ ప్రత్యేకతలతో జనాన్ని పట్టి పెట్టి వుంచగలడు?

జనాకర్షణ, సానుభూతి వంటివి నీటిబుడగలతో సమానం. ఈరోజు ఎంతో ఉధృతంగా వున్నట్లు కనిపిస్తాయి. రేపటికి అయిపు లేకుండా పోతాయి. వాటిని నమ్ముకొని రాజకీయం చేయదమంటే కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదడమే అవుతుంది.

### వైఎస్ వల్లే కాలేదు

2010 ఎన్నికలు వైఎస్ బ్రతికి వున్నప్పుడే జరిగాయి. ఎన్నికల నిర్వహణలో ఆయన సమర్థత అందరికీ తెలుసు. చిరంజీవి, లోక్‌సత్తాల వల్ల ప్రభుత్వ వ్యతిరేక ఓట్లు చీలిపోయి, తెలుగుదేశం దెబ్బ తిన్నది. అయినా సరే కాంగ్రెస్‌కు బొటా బొటి మెజార్టీ మాత్రమే వచ్చింది. అదృష్టం బాగుండబట్టి సరిపోయింది కానీ, చిరంజీవికి మరొక రెండు మూడు శాతం ఓట్లు ఎక్కువ వచ్చి వుంటే వైఎస్ మళ్లీ అధికారంలోకి వచ్చేవాడు కాదు. సుదీర్ఘ రాజకీయ అనుభవం, అవధులు లేని ఆర్థిక సంపత్తి, నిర్వహణా చాతుర్యం కల్గిన వైఎస్ వల్లనే జనాన్ని పట్టి పెట్టి వుంచడం సాధ్యం కానప్పుడు, రాజకీయ అనుభవశూన్యుడైన జగన్ వల్ల అవుతుందా అన్నది ఎమ్మెల్యేలను వేధిస్తున్న ప్రశ్న.

### దూకుడు ఎందుకు తగ్గింది?

జగన్‌కు కూడా ఈ సందేహాలు, అనుమానాలు అన్నీ వస్తున్నట్లున్నాయి. యాత్ర మొదలు పెట్టినప్పుడున్న దూకుడు, మూడు రోజుల తర్వాత కన్పించక పోవడానికి కారణమదే అని పరిశీలకుల అభిప్రాయం. శ్రీకాకుళం సభలో ఆయన ముఖ్యమంత్రి రోశయ్యను, అధిష్టానాన్ని ధిక్కరించి మాట్లాడారు. నా యాత్రకు ఎమ్మెల్యేలు, మంత్రులను రాకుండా అడ్డుకొంటున్నారని విమర్శించాడు. మా నాన్న చనిపోయిన తర్వాత రాజకీయాలు దిగజారి పోయాయని ఆవేదన చెందాడు. ఎంతో మంది ఎమ్మెల్యేలు నా దగ్గరకు రాకుండా వుండలేక నరక యాతన పడుతున్నారని వ్యాఖ్యానించారు. కానీ యాత్ర తూర్పు గోదావరి జిల్లాకు వచ్చేసరికి ఆ దూకుడు లేదు. మనిషి నెమ్మదించాడు. దీనికి కారణం – తాను ఆశించినట్లు ఎమ్మెల్యేలు, మంత్రులు గట్లు తెంచుకొన్న గోదావరి వరద నీటి వలె తన శిబిరంలోకి దూకుతారని వేసుకొన్న అంచనాలు తలక్రిందులు కావడం.

### అన్నీ దురాశలే!

జగన్‌లో ఆశల కంటే దురాశలు ఎక్కువ. తన యాత్రతో రోశయ్య ప్రభుత్వానికి మరణ శాసనం లిఖించాలన్నది వాటిలో ఒకటి. కనీసం నలభై నుంచి యాభై మంది ఎమ్మెల్యేలు తన వైపు దూకుతారని, ఆ దెబ్బతో ప్రభుత్వం పడిపోయి, ఎన్నికలు రావడం ఖాయమని, వైఎస్ పట్ల జనంలో వున్న మోజును బట్టి చూస్తే, ఆ ఎన్నికలలో తాను గెలిచి, అధికారంలోకి రావడం ఖాయమని గాలిలో మేడలు కట్టుకొన్నాడు జగన్. కానీ ఇప్పుడా పరిస్థితి మచ్చుకు కూడా కన్పించడం లేదు. రోశయ్య ప్రభుత్వం పడిపోయే సంగతి దేముడెరుగు, తన పరువు నిలుపుకోవడానికి ఇరవై పాతిక మంది ఎమ్మెల్యేలైనా తన పక్షం చేరే సూచన కన్పించడం లేదు. దాదాపు 75 మంది ఎమ్మెల్యేలు కేవలం వైఎస్ పుణ్యాన రాజకీయాలలోకి వచ్చి, పదవి పొందారు కాబట్టి, వారంతా వైఎస్ పేరు చెప్తే తన వెంట వచ్చేస్తారని భ్రమ పడ్డాడు జగన్. కానీ వారు అకారణంగా తమ రాజకీయ భవితవ్యాన్ని పాడు చేసుకొనేందుకు సిద్ధంగా లేరు. ఎవరికివారు జగన్ శిబిరంలో సంఖ్య పెరిగిన తర్వాత తమ నిర్ణయం చెప్తామనే ధోరణిలో వున్నారు. దానితో ఆ సంఖ్య పది కూడా తాకడం లేదు.

### డబ్బున్న వారిలో దిగులు

మరొకప్రక్క వైఎస్ హయాంలో ఆర్థిక లాభాలు పొందిన వ్యాపారులు, డబ్బున్నవారు తీవ్ర ఆందోళనకు గురౌతున్నారు. ఉరుము ఉరిమి మంగళం మీద పడినట్లు, జగన్ మీద కోపంతో కేంద్ర ప్రభుత్వ పెద్దలు తమ వ్యాపారాలను పట్టి చూస్తారేమో అన్న దిగులుకు లోనౌతున్నారు. వీరిలో చాలా మందివి సక్రమ వ్యాపారాలు కావు. కేంద్ర ప్రభుత్వం తలచుకొంటే కేసులు, చిక్కులు, చీకాకులతో వీధుల పాలై పోతారు. జగన్ రాబడి వనరులను బిగపట్టగల్గితే, దారికి వస్తాడన్న ఆలోచన ఢిల్లీ పెద్దలలో వుందనే చెప్తున్నారు. కేసులు పెట్టడం, దాడులు చేయడం కాకుండా, వ్యాపార వర్గాల నుంచి జగన్‌కు కొత్తగా డబ్బుచేరే మార్గాలను మూసివేస్తే సగం సమస్య తీరుతుందన్నది వారి ఆలోచన అట. అదే నిజమైతే గాలి జనార్దనరెడ్డి వంటి వారి మీద ఒత్తిడి పెరుగుతుంది.

మొత్తానికి జగన్ వ్యవహారం గందరగోళంగా తయారైంది. గత వారంలో ఆయన విప్లవ వీరుడిగా చరిత్రకు ఎక్కడం ఖాయం అన్న భావన వుండింది. ఇప్పుడంత తీవ్రత లేదు. అటు సర్దుబాటు కన్పించడం లేదు, ఇటు తెగింపూ చూపడం లేదు. తనెటు పోవాలో తనకే అర్థంకాని అయోమయంలో జగన్ కొట్టుమిట్టాడుతున్నాడు. ఆయనలోనే అంత అనిశ్చిత స్థితి వుంటే, ఆయన్ను నమ్ముకొని వెంట రావాలనుకొనే వారి మానసిక పరిస్థితి ఇంకెంత అగమ్యగోచరంగా వుంటుందో అర్థం చేసుకోవచ్చు.



## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

ఎసిస్టేడియంలో జరుగనున్నాయి. మండలస్థాయిలో ఈ పోటీల్లో ఈ నెల 14వ తేది నుంచి 17వ తేది వరకు జరుగుతాయి. అక్కడి విజేతలు నెల్లూరులో జరిగే పోటీల్లో పాల్గొంటారు. వాలీబాల్, కబడ్డీ, ఖోఖో ఆటలతోపాటు పలు క్రీడాపోటీలు జరుగుతాయి. బహుమతి మొత్తాలు కూడా బాగున్నాయి.

### పెద్దలను తిట్టిన మేకపాటి!

తన పనేదో తాను చేసుకపోయే ఉదయగిరి శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి జగన్ ఓదార్పు యాత్ర చేపట్టిన నాటి నుంచి తన ధోరణి మార్చుకొన్నారు. జగన్‌ను ఎవరైనా ఏమైనా అంటే ఊరుకోవడం లేదు. ఈ కోవలోనే జగన్‌ను విమర్శించిన రాజ్యసభ సభ్యుడు వి.హనుమంతరావు, పార్టీ సీనియర్ నేత పాల్వాయి గోవర్ధనరెడ్డిని తిట్టి పోశారాయన. ఓదార్పు యాత్ర విజయవంతం కావడం చూసి సీనియర్లు మతిభ్రమించి మాట్లాడుతున్నారు. వారికంత సీన్‌లేదు. దమ్ముంటే వారు ప్రత్యక్ష ఎన్నికల్లో నిలబడి గెలవాలన్నారాయన. అయినా మేకపాటి విమర్శలు హనుమన్న, పాల్వాయి దాకా వెళ్లవుగా?

### జన సముద్రమైన రామతీర్థం!

రామతీర్థంలో వెలసిన రామలింగేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు గడచిన వారంలో ఘనంగా జరిగాయి. 11వ తేది జరిగిన వసంతోత్సవానికి ఆదివారం, అమావాస్య రెండూ కలసి రావడంతో దైవదర్శనం, సముద్ర స్నానం చేయను జనం పోటెత్తారు. దేవస్థానం నుంచి సముద్రతీరం మధ్య ఇసుక వేస్తే రాలనంత జనం బారులు తీరారు.

### రామనారాయణరెడ్డి జన్మదినం!

పురపాలక మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి 58వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు విశ్వభారతి అంధుల పాఠశాలలోని పిల్లలకు పండ్లు, కేకులు, స్వీట్లు పంచిపెట్టారు. ఈ కార్యక్రమం జిల్లా కాంగ్రెస్ ఎస్‌సిసెల్ నాయకుడు ఏసు నాయుడు నేతృత్వంలో జరిగింది.

### బ్రాహ్మణ వివాహ పరిచయ వేదిక

బ్రాహ్మణ ఉచిత వివాహ సమాచార కేంద్రం ఆగష్టు 22తేదిన రాష్ట్రస్థాయి బ్రాహ్మణ వధూవరుల పరిచయ వేదికను కస్తూరిబా కళాక్షేత్రంలో నిర్వహిస్తున్నట్లు సంస్థ కన్వీనర్లు ఎం.కామేశ్వరప్రసాద్, జివి.శివనారాయణ తెలిపారు. రిజిస్ట్రేషన్ చేసుకోదలచినవారు 99850 25173, 2337501లలో సంప్రదించవచ్చు.

### పదవీ విరమణ

నెల్లూరు మూలాపేటలోని బాలికోన్నత పాఠశాలలో వృత్తి విద్యా బోధకురాలుగా పనిచేసిన పార్వతమ్మ పదవీ విరమణ సందర్భంగా సన్మాన కార్యక్రమం జరిగింది. పాఠశాల ప్రధానోపాధ్యాయురాలు, ఉపాధ్యాయ సిబ్బంది పార్వతమ్మ సేవలను ప్రస్తుతించారు.

## వెనకబడ్డ తెరాస

మొదటి పేజీ కొరవ

కాబట్టి, శ్రమ ఖర్చు ఎందుకు అన్న ధోరణిలో వున్నారాయన. మరొకప్రక్క టిఆర్ఎస్ అభ్యర్థులకు ప్రజలలో పలుకుబడి లేదు. ఉద్యమం వూపుతో ఎమ్మెల్యేలైన వారే తప్ప స్వంత బలం లేదు. కాంగ్రెస్, టిడిపిలు మాత్రం దిట్టమైన అభ్యర్థులను నిలబెట్టాయి. వారితో పోటీ పడి ప్రచారం చేయడం టిఆర్ఎస్ తరం కావడం లేదు.

మొత్తం పన్నెండు సీట్లలో ఏ ఒక్కటి చేజారినా తెలంగాణ ఉద్యమమే బలహీనపడి పోతుందన్న నినాదంతో కెసిఆర్ ప్రచారం చేస్తున్నారు. ఆయన వద్ద వున్న అస్త్రం అది ఒక్కటే. కానీ కాంగ్రెస్ అభ్యర్థులలో డి.శ్రీనివాస్, షబ్బీర్ అలీ, ఇంద్రకరణ్‌రెడ్డి వంటివారు తాము గెలిస్తే మంత్రులమౌతామని ఓటర్లను ప్రాధేయపడుతున్నారు. తెలంగాణ ఇచ్చేది, తెచ్చేది కాంగ్రెస్ పార్టీ తప్ప టిఆర్ఎస్ కాదని ప్రజలకు నచ్చ చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. అభ్యర్థుల వ్యక్తిగత బలాబలాలు చూస్తే కాంగ్రెస్ వారికి, టిఆర్ఎస్‌కు చాలా తేడా వుంది. టిడిపి కూడా వరంగల్ వంటి స్థానాలలో ధీటైన అభ్యర్థులను నిలబెట్టింది. కనీసం ఒక్క సీటు గెల్చుకొన్నా తమ పార్టీ పరువు నిలుస్తుందన్నది వారి ప్రయత్నం. కాంగ్రెస్ మాత్రం ఐదు స్థానాలలో విజయావకాశాలున్నాయన్న ఆశతో వుంది.

తెలంగాణ ఉద్యమ ఉధృతికి నిలయాల వంటి ఈ స్థానాలలో తెలంగాణ వాదం తప్ప వేరొకటి నెగ్గుతుందని ఆశించడం అతిశయోక్తి అవుతుంది. కానీ టిఆర్ఎస్ తప్పిదాలు, చేతకాని తనంతో ఫలితాలు తారుమారయ్యేట్లున్నాయని పరిశీలకుల భావన.

## జగన్ పర్యటన

16వ పేజీ కొరవ

నడవడం ఆయనకు అలవాటు. డిసిసి అధ్యక్షుడు ఎల్లసిరి గోపాలరెడ్డి కూడా నిర్ణయం తీసుకొన్నట్లే లెక్క. డిసిసి పదవి చేతికి రాగానే, ముప్ఫయ్యేళ్లుగా తనకు ఆసరా ఇచ్చిన నేదురుమల్లి జనార్దనరెడ్డిని నట్టేట ముంచిన ఘనుడాయన. దానివల్ల ఆ పదవిపోయిన తర్వాత తనకు కాంగ్రెస్‌లో పుట్టగతులు వుండవని భయపడి, జగన్ శిబిరంలో రక్షణ పొందాలనుకొంటున్నాడు.

రాజీవ్‌భవన్ నిర్వాహకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి అందరికంటే రెండాకులు ఎక్కువ చదువుతున్నాడు. జగన్ శిబిర అధికార ప్రతినిధి వలె వ్యవహరిస్తున్నాడు. అన్ని టీవీ ఛానళ్లలో ఆ ముఖమే కన్పిస్తున్నదిప్పుడు. అయితే శ్రీధర్‌రెడ్డి ఒక్కడే వెళ్తాడా లేక రాజీవ్‌భవన్ బృందం మొత్తాన్ని తనతో తీసుకవెళ్తాడా అన్నది తెలియదు.

## జనవాణి

2వ పేజీ కొరవ

చూసుకొనేందుకు ఏదైనా హిందూ ధర్మపీఠానికి అప్పగిస్తే ధర్మ సంస్థాపన, సనాతన ధర్మ పరిపోషణ జరుగుతుంది. లేకుంటే ఇప్పటికే అధోగతిపాలైన సనాతన ధర్మం శూన్యమవుతుంది.

*జి.సూర్యనారాయణ, నెల్లూరు*

# యవనరాజ్య స్థాపనాచార్యుడు శ్రీకృష్ణదేవరాయలు!

(గతవారం తరువాయి)

గోల్కొండ షాహి వంశస్థుడైన మహమూద్ షాహిని బీదరు సుల్తాను చెరలో పెట్టి స్తాడు. షాహి తల్లి ఈ విషయంలో కృష్ణదేవరాయల్ని శరణు వేడుతుంది. అమ్మవైన నీ మాట తప్పక చెల్లి స్తానని హామీ యిస్తాడు రాయలు. 1516–17 ప్రాంతాలలో రాయలు బీజాపూర్ బీదర్(బెదడకోట) ప్రాంతాలపై దండెత్తి జయించి, చెరలోని మహమూద్ షాహిని విడిపించి పట్టాభిషేకం జరిపించి 'యవన రాజ్యస్థాపనాచార్య' అని ప్రస్తుతింపబడతాడు.

## చరిత్ర వెలుగులు - కొన్ని కొత్త కోణాలు

రెండవ సంఘటన చిన్నాదేవి విషయంలో జరిగింది. యవ్వన ప్రాయంలో రాయలు చిన్నాదేవిని ప్రేమిస్తాడు. రాజ సాంప్రదాయం ప్రకారం కులస్థురాలిని వివాహమాడిన తర్వాత చిన్నాదేవితో వివాహం జరిపిస్తానని మంత్రి తిమ్మరసు వాగ్దానం చేస్తాడు.

క్రీ.శ.1498 సంవత్సరంలో శ్రీరంగపట్నం కుమారవీరయ్య కుమార్తె తిరుమలాంబతో శ్రీకృష్ణదేవ రాయల వివాహం జరుగుతుంది.

ఆ తర్వాత తిమ్మరసు 1499–50 ప్రాంతాలలో చిన్నాదేవితో వివాహం జరిపిస్తాడు. శ్రీకృష్ణదేవరాయల వాగ్దానమూ నెరవేరినట్లయింది. చిన్నాదేవికి ఒక కుమార్తె వేంగళాంబ జన్మిస్తుంది. ఈమెను అళియ రామరాయలు తమ్ముడు తిరుమలరామరాయలకిచ్చి వివాహం చేస్తారు. తిరుమలరాయరాయలు పెనుగొండ పాలకుడు. క్రీ.శ.1565 సంవత్సరంలో తల్లికోట యుద్ధంలో తిరుమల రాయలకు కన్నొక్కటి పోతుంది. ఓటమిపాలైన తిరుమలుడు సదాశివరాయల్ని ధనాన్ని తీసుకొని పెనుగొండ మరలిపోయి 1570లో అక్కడ వైభవోపేతంగా సింహాసనాన్ని అధిష్టిస్తాడు. అప్పటికి శ్రీకృష్ణదేవరాయల కుమార్తె వేంగళాంబ(తిరుమల రాయల పట్టపురాణి) మరణిస్తుంది.


పెనుగొండలో ప్రతిష్టించనున్న శ్రీకృష్ణదేవరాయల విగ్రహం.

పోర్చుగీసు రాయబారి డొమింగో ఫేస్ ప్రకారం శ్రీకృష్ణదేవరాయలు సహృదయుడు, తెల్లని వస్త్రాలు ధరించేవాడు. అంగరఖా(జుబ్బా)పై బంగారు తీగలతో అల్లిన గులాబీ ఉండేవి. ముఖంపై స్ఫోటకపు మచ్చలున్నప్పటికీ ఆకర్షణీయంగా కనిపించేవాడు. ప్రశాంతంగా సమస్యలు వినేవాడు. పరిష్కారాల్ని ప్రధానుల్ని, ముఖ్యంగా సాళువ తిమ్మరసును సూచించను గౌరవించేవాడు. పెద్దల్ని ముఖ్యంగా తిమ్మరసు తల్లితండ్రుల ప్రస్తావన తెచ్చేవాడు. అది రాయల సహృదయతకు నిదర్శనం.

### తల్లితండ్రులను గురించి...

తుళువ తిమ్మనాయకుడు, దేవకీదేవి రాయల తాతకు తండ్రి, ఈశ్వరనాయకుడు, బుక్కాంబలు తాతయ్య, తాతమ్మలు. తుళువ నరసానాయకుడు నాగమాంబ రాయల తల్లితండ్రులు.

రాయలు తిరుమలను ఏడుమార్లు దర్శిస్తే మూడవ మారు మాత్రం కేవలం తన తల్లిదండ్రులు నరసానాయకుడు, నాగమాంబ పుణ్యానికిగానూ రాయలు క్రీ.శ.1513 జూన్ 13వ తేదీన తిరుమలను సందర్శించాడు. ఈ సమయంలో రాయలు తిరుమలేశునికి ఒక బంగారు గిన్నె, విలువైన వజ్రాభరణాలను సమర్పించారు. ప్రతి సంవత్సరం ఫిబ్రవరి మాసంలో స్వామివారి ఉత్సవాలకుగాను కాట్రవాడి, తురూరు, కరికంబాడు గ్రామాలను దానం చేశాడు. సందర్శన సమయంలో రాయల రాణులెవరూ పాల్గొనలేదు.

శాలిశకం 1437 అంటే 1515 సంవత్సరంలో గుంటూరు జిల్లాలోని అమరేశ్వరాలయాన్ని సందర్శించి(ధరణికోట) తన తండ్రి నరసారాయణి గారికిన్ని, తల్లి నాగమాంబకు పుణ్యం కలుగుటకుగాను పెద్దమద్దూరు గ్రామాన్ని ఈశ్వరుడికి సమర్పించి సదరు ఆదాయాన్ని నిత్య ధూపదీప నైవేద్యాలకు ఉపయోగించవలసిందిగా శాసనం వేయించారు.

శాలిశకం 1438లో అనగా క్రీ.శ.1516లో సింహాచలంలో సింహాద్రి నాధుని దర్శించి తన తల్లితండ్రుల పుణ్యానికి గాను నవరత్న ఖచిత కంఠమాలను, ముత్యాలను సమర్పించాడు.

తల్లి నాగమాంబ మరణానంతరం హంపీ విజయనగరానికి పశ్చిమ దిశలో నాగలాపురాన్ని నిర్మింపజేశాడు. నిజానికి కృష్ణదేవరాయల మాతాపితృ భక్తి వల్ల తుళువ నరసనాయకుడు, తల్లి నాగమాంబ ధన్యులయ్యారు.

## పాయసం సుబ్రహ్మణ్య మహర్షి

### రాయలకు ప్రాణదాత మహామంత్రి తిమ్మరసు!

కృష్ణదేవరాయల తండ్రి తుళువ నరసరాయలకు నాదెండ్ల చిట్టి గంగనామాత్యుడు చాలా సన్నిహితుడు. చిట్టి గంగన మంత్రి, మేధావి, సకల విద్యాపారంగతుడు. ఈ చనువుతో తన సమీప బంధువైన సాళ్వ తిమ్మరసును నరసరాయల దగ్గర ఉద్యోగిగా చేర్చాడు.

భారతదేశంలోని అష్టమేధావుల్లో(శ్రీకృష్ణుడు, చాణక్యుడు, రాక్షసుడు, యుగంధరుడు మొదలైన వారు) తిమ్మరసు ఒకడు. అందువల్ల అనతికాలంలోనే తిమ్మరసు నరసరాయల వద్ద (క్రీ.శ 1493 – 1505) మంత్రి కాగలిగాడు. ఆ తర్వాత అతని కుమారుడు తుళువ వీరనరసింహ రాయల వద్ద (1505–1509) శిరః ప్రధాని అయ్యాడు. నరసరాయలకు బాలుడైన కుమారుడున్నాడు. అందువల్ల అతనికి తన తమ్ముడైన శ్రీకృష్ణదేవరాయలు అడ్డువస్తాడని అతన్ని తొలగించమని తన అవసాన దశలో తిమ్మరసును కోరుతాడు.

(మిగతా వచ్చేవారం)

# మంచి మాటల సమాహారం ఉపవని

నెల్లూరీయులందరికీ సువరిచితుడైన కవి 'రసిక్' తాజాగా వ్రాసిన 'ఉపవని' ఓ అనువాద సుభాషితాల సంకలనం. తాను ఎంచుకున్న పది మంది ప్రముఖులు వివిధ సందర్భాలలో చెప్పిన లేదా వ్రాసిన వాటిలో తాను సుభాషితంగా పనికి వస్తుందనుకున్న వ్యాఖ్యను అనువదించి అందజేసిన మంచి మాటల సమాహారమే ఈ పుస్తకం. తెలుగు అనువాదం అనేక దశలు దాటి ప్రస్తుతం మాతృ భాషాస్థాయిలో అసలు అనువాదమా, స్వంతమా అన్న అనుమానం కలిగించని రీతిలో సరళంగా, సహజంగా సాగిపోతున్న స్థితికి నేడు చేరుకున్నది.

నాటి తాత్వికులు అరిస్టాటిల్, ప్లేటో తత్వ శాస్త్ర రచనల నుంచి నేటి అరుదైన శాస్త్రజ్ఞుడు స్టీఫెన్ హాకింగ్ భౌతికశాస్త్రం రచనల వరకు మాతృ భాషా స్థాయిలోనే తెలుగులో అనువాద రచనలు దొరికే కాలంలో మనం జీవించడం ఓ అదృష్టం. ఈ నేపథ్యంలో రసిక్ అనువాదం నేటి తరం పాఠకులకు గొంతు దిగడం కష్టం.

అస్తమించే మలి వయసులో వున్న గ్రాంథిక సాహిత్య కారకులకయితే సరిపోతుంది కానీ, ఉదయిస్తున్న మన భవిష్యత్ వారసత్వానికి మాత్రం ముద్ద ముద్దకీ గ్లాసుడు నీళ్ల త్రాగాల్సిందే. ఈ ఉపవనిలో "ఓరీ మన్మధా, కోదండ టంకారములచే కెంగేలి కేల ఈ వృధాశ్రమ. ఓహో కోకిలా! ఎందులకీ అవ్యక్త మృదు మధుర ప్రేలాపనము. ముగ్ధా! నీ స్నిగ్ధ విదగ్ధ ముగ్ధ మధుర లోల కటాక్షములిక చాలును. నేనిప్పుడు చంద్ర చూడ చరణ ధ్యానామృత పానమత్త చిత్తుడనై యున్నాను."

| పుస్తకసమీక్ష |
| --- |
| **ఉపవని** |
| సేకరణ – అనువాదం : **రసిక్** |
| సమీక్షకుడు : **చింతల జాషువా** |
| వెల : **30/-లు** |
| ప్రతులకు : శ్రీమతి జి.అరుంధతి 10–71/8, లావణ్య అపార్టుమెంటు, రాయలచెరువు రోడ్డు, తిరుపతి – 517501 |

ఇక సూక్తి కాదు గదా, సాధారణ మంచి మాట స్థాయిలో కూడాలేని అనేక వాక్యబంధాలు. అన్నంలో రాళ్లలా ఈ ఉపవని భోజనాన్ని మరింత ఇబ్బంది పెడ్తాయి.

'అఖండితమైన పతి ప్రేమ నీకు లభించుగాక' ఈ దీవెన వాక్యాన్ని సూక్తిగా ఎట్లా భావించాలి? 'తప్త లోహం వలె మధ్యన అతుకు తెలియకుండా ప్రభూ! నన్ను నీలో చేర్చుకో! ఇది ఒక ప్రార్థనా వాక్యం కాదా!

ఇంకా 'మీకు కన్నీళ్లు అన్నవి వుంటే కార్చేందుకు ఇప్పుడు సిద్ధపడు' 'క్రొత్తరకపు ఉనికి నన్ను బెదరగొడుతుంది'. లాంటివి అనేకం ఉపవని అనుసూక్తి సంకలనంలో సూక్తులుగా మనల్ని భావించమని కోరుతుంటాయి.

ఇంతేకాదు 'పీడిన కొప్పుతో, అరగన్నులతో, పురుషాయిత రతి శ్రమ వలన చెమరిన చెక్కులతో అక్కున వ్రాలి విందొనరించు వధువుల అధర మధువు నదృష్టవంతులే చవి చూడగలరు' అన్న రతి విశేషం కూడా సూక్తి పేరుతో ఉపవనిలో ప్రవేశించింది.

అయితే వీటితోపాటు తర్కం, స్నేహం, దైవత్వం, వ్యక్తిత్వ వికాసాలకు సంబంధించిన అద్భుతమైన సూక్తులున్నదీ ఉపవనిలోనే.

వ్యక్తిత్వ వికాసం కోసం, పాశ్చాత్య సాహిత్య పుస్తకాలు, డబ్బిచ్చి హాజరయ్యే ప్రముఖుల ప్రసంగాల కన్నా, మన భారతీయ సాహిత్య మూలాల్లో కావాల్సినంత వ్యక్తిత్వ వికాస విషయాలున్నాయి. అధ్యయనం చేసి అభివృద్ధి చెందండి అన్న పిలుపు రసిక్ పరోక్షంగా తన ఉపవని ద్వారా నేటి యువతరానికిస్తున్నాడా అనిపిస్తుంది.

'ఎన్నిమార్లని ప్రపంచానికి నచ్చజెప్పను. మీరు పట్టుకున్నది గొర్రెతోక, దాటదలిచింది సముద్రాన్ని' అని. 'సాధువును కులమడక్కు జ్ఞానమడుగు. కత్తిని బేరం చేయి. ఒరదేమున్నది?'

యువకుల్లారా, యువతుల్లారా 'ఉపవని'ని మీరు చదవాల్సిందే. కాళిదాసు, భర్తృహరి, కబీర్, రహీమ్, తిరువళ్లువర్‌లు మీతో మాట్లాడతారు. వినండి. తర్కం, చింతన, వ్యక్తిత్వ వికాసాలకు సంబంధించి అద్భుతమైన ఆలోచనా ప్రపంచంలోకి మిమ్ముల్ని తీసుకెళ్తారు. వెళ్లండి. 'లే, మేలుకో, గమ్యాన్ని చేరే వరకు ఆగకు' అంటున్న వివేకానందుడ్ని దర్శించేందుకు మీరు ఉపవనిలో ప్రవేశించండి!.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



## ● నెల్లూరుకు

# జగన్ పర్యటన ఖరారు!

నెల్లూరు జిల్లాలో వైఎస్ జగన్ ఓదార్పు యాత్ర ఆగష్టు 11తేది నుంచి ప్రారంభమౌతుంది. ప్రకాశం జిల్లా మీదుగా రాబోతున్నాడాయన. జగన్ యాత్ర అంటే జిల్లా కాంగ్రెస్ వాదులకు అగ్ని పరీక్షతో సమానం. గోడ మీద పిల్లులు, రెండు పడవలలో కాళ్లు పెట్టి ప్రయాణించాలనుకొనే వాళ్లు ఇబ్బందులలో పడక తప్పదు.

జిల్లాలో ఇప్పటివరకు ఎమ్పీ మేకపాటి రాజమోహన్ రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి మాత్రమే బహిరంగంగా జగన్ పక్షం చేరారు. శేఖర్‌రెడ్డి ఒక అడుగు ముందుకు వేసి, తమకు కాంగ్రెస్ పార్టీ కంటే జగన్ ఎక్కువ అని ప్రకటన చేశాడు. జగన్ కూడా తనను కలవడానికి నెల్లూరు నుంచి ఎవరు వచ్చినా "గౌతంరెడ్డి"తో మాట్లాడమని చెప్పున్నాడట. గౌతం అంటే రాజమోహన్‌రెడ్డి కుమారుడు. వ్యాపారాలు సాపారాలు తప్ప రాజకీయాలతో కనీసపాటి సంబంధం కూడా లేదు గౌతంరెడ్డికి. ఆయన్ను కొత్తగా తెర మీదకు తెచ్చే ప్రయత్నం జరుగుతున్నట్లుంది, జగన్ ద్వారా.

ఆనం సోదరులిద్దరూ గోడ మీద పిల్లుల వలెనే కాలక్షేపం చేస్తున్నారు. ఎటుపోవాలో వారికి అర్థం కావడం లేదు. ముఖ్యమంత్రి రోశయ్య వద్దకు వెళ్లి మేము కాంగ్రెస్‌ను వదలి వెళ్లమని చేతిలో చెయ్యి వేసి బాసలు చేస్తున్నారు. కెవిపి రామచంద్రరావును కలిసి మీతోనే వుంటామని హామీలు గుప్పిస్తున్నారు. ఇప్పటికిప్పుడు జగన్‌తో వెళ్తే మంత్రి పదవి వూడుతుందన్న భయం రామ నారాయణరెడ్డిది. మునిసిపల్ ఎన్నికలు ముంగిట్లో పెట్టుకొని పిచ్చి వేషాలు వేస్తే ఒళ్లు పులిసి పోతుందన్నది వివేకానంద రెడ్డి జంకు. జగన్ కొత్త పార్టీ పెడతాడో లేదో తెలియదు. ఒకవేళ పెట్టినా, అది ఒక రూపు సంతరించుకొనేదెప్పుడో అసలే తెలియదు. ఈలోగా తొందరపడితే, మునిసిపల్ ఎన్నికలలో బోల్తా పడాల్సి వస్తుంది. మునిసిపల్ రాజకీయాలు ఆనం కుటుంబానికి ఆయువు పట్టు వంటివి. అవి లేకుండా వారికి పూట గడవదు. అయితే జగన్‌కు దూరంగా మసలితే వైఎస్‌కు ద్రోహం చేశారన్న నింద పైన పడుతుంది. లేనిపోని చిక్కు తెచ్చి పెట్టాడు జగన్.

11తేది ఓదార్పు యాత్రలో తాము పాల్గొనేది లేనిదీ స్పష్టం చేయకుండా దాగుడుమూతలు ఆడుతున్నారు వారు. ఈ యాత్ర జరపాలంటే, నెల్లూరు నగరం, ఆత్మకూరు పట్టణాలలో ఒకటి రెండు చోట్లయినా వైఎస్ విగ్రహాలు పెట్టాలి. ఇప్పుడే విగ్రహాలు ఏర్పాటుకు పూనుకొంటే రోశయ్యకు అనుమానం వస్తుందన్న భయం. తాము సాచేటు చేస్తే కాంగ్రెస్‌లోని ద్వితీయశ్రేణి నేతలు ముందు మిగిలిపోతారన్న సంశయం. వారి అవస్థ చూస్తుంటే జాలి కల్గుతున్నది.

అల్లూరు మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్ రెడ్డి కూడా అటు వైపే మొగ్గాలని నిర్ణయించుకొన్నట్లు తెలుస్తున్నది. సూళ్లూరుపేట మాజీ ఎమ్మెల్యే నెలవల సుబ్రహ్మణ్యం ఒక అడుగు ముందుకేసి, జగన్ వ్యతిరేకులను తిట్టే పనిలో పడ్డాడు. సుబ్రహ్మణ్యానికి నోటి దూల ఎక్కువ. ఎవరినైనా తిట్టమంటే ఒంటి కాలి మీద లేస్తాడు. ఆ తొందరపాటు వల్ల ఎన్నిసార్లు ఇబ్బందులు వచ్చినా, తిట్టే నోరు తిరిగే కాలు సామెతలోనే

కొరవ 14వ పేజీలో

## ● అణు బిల్లు బాధ్యత

# టిఎస్ఆర్‌కు అప్పచెప్పిన ప్రధాని!



తిక్కవరపు సుబ్బరామరెడ్డికి ఢిల్లీ రాజకీయవర్గాలలో వున్న సాన్నిహిత్యం, పలుకుబడి లోకానికంతా తెలుసు. కొత్తగా చెప్పవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. ఆలస్యంగా మొదలుపెట్టినా ఆంధ్రరాష్ట్రంలో మరెవ్వరూ అందుకోలేనంత ఎత్తుకు సాగుతున్నది ఆయన రాజకీయ ప్రస్థానం.

న్యూక్లియర్ లయబిలిటీ బిల్లు పరిశీలనకు ఏర్పాటు చేసిన పార్లమెంటరీ ప్యానెల్ బాధ్యతను సుబ్బరామరెడ్డికి అప్ప చెప్పాడు ప్రధాని మన్మోహన్‌సింగ్. అమెరికాతో మన సంబంధాలకు, ఈ న్యూక్లియర్ బిల్లుకు విడదీయరాని సంబంధం వుంది. చాలా వివాదాస్పదమైన బిల్లు అది. వామపక్షాలతో పాటు దేశంలోని పలు ప్రజా సంఘాలు దాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తున్నాయి. లోక్‌సభలో ఆమోదం కోసం దాన్ని ప్రవేశ పెట్టినప్పుడు వచ్చిన విమర్శలను తట్టుకోలేక, ఈ ప్యానెల్ పరిశీలనకు పంపాడు ప్రధాని. ప్రతిపక్షాలకు నచ్చ చెప్పి, బిల్లు ఆమోదం పొందేట్లు చూడడం ఆ ప్యానెల్ కర్తవ్యం. తమ దేశాధ్యక్షుడు దేశ పర్యటనకు వచ్చేలోగా బిల్లు ఆమోదం పొందాలని అమెరికన్ ప్రభుత్వం ప్రధాని మీద ఒత్తిడి తెస్తున్నది. అంతర్జాతీయ సంబంధాలతో ముడిపడి వున్న ఈ కీలక బాధ్యతను సుబ్బరామరెడ్డి అయితేనే మెళకువగా నెరవేరుస్తాడన్న నమ్మకం చూపాడు ప్రధాని. ఇదే సమయంలో, కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీకి కార్యదర్శిగా సుబ్బరామరెడ్డిని నియమించింది సోనియా గాంధీ. ఆ సంస్థకు ఆమె అధ్యక్షురాలు. ఎంతో నమ్మకం వుంటే తప్ప ఇంత పెద్ద బాధ్యత అప్పచెప్పడం జరగదు. లోక్‌సభ, రాజ్యసభ రెండింటి వ్యవహారాలను చక్కబెట్టవలసిన బాధ్యత ఈ కమిటీదే అన్న మాట గుర్తుంచుకొంటే, సోనియాగాంధీ సుబ్బరామరెడ్డి మీద చూపిన నమ్మకం ఎంత వున్నతమైనదో అర్థమౌతుంది.

ఢిల్లీలో నెల్లూరుస్థాయిని పెంచుతున్న సుబ్బరామరెడ్డికి మా అభినందనలు.





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.